# లోక సాహిత్యమాల

ప్రమాత శతజయంతిని పురస్కరించుకొని మన యాంధ్ర ప్రదేశమునందలి తెలుగు భాషాభాషులకు, రాష్ట్రేతరాంధ్ర సోదరులకును ప్రమాత సాహిత్యమును తెలుగు భాషలో సంపుటాలుగా అందయు ఉద్దేశ్యముతో ప్రమాత శతజయంతి గ్రంథ ప్రచురణ సమితి 1976 న సంవత్సరమున ఏర్పాపైన విషయము అందరకు తెల్సినదే. ఇప్పటికా సమితి పక్షాన 6 సంపుటములు తెలుగువారి సహకారముతో ప్రచురించబడిన సంగతియు అందరెరిగినదియే. ఇకముందుకూడ మిగిలిన సంపుటములు తెలుగువారి సహాయసహకారాలతో అచ్చువేయు ప్రణాళిక సమితిముందున్నది.

ఇది ఇట్లుండ, శ్రీమాతారవిందుల సాహిత్యము విషయ గాం ర్య కారణముగా సులభముగా అర్థముగాదను మాట తరచుగా వినబడుచున్నది. అందు సత్యము లేకపోలేదు. కాని; గం ర సాహిత్యాధ్యయనమునకు మనమును సిద్ధము కావలయుననుటయు ఉచితమే గదా !

కాని; వితభౌతికావసరాల పూర్తి చేయుటకు నిర్విరామముగా పనిచేయుచున్న నేటి మానవునికి ఇటువంటి మహోన్నత సాహిత్యము నధ్యయనము - యుటకు తీరిక, ఓపికకూడ తక్కువే. అటువంటప్పుడు అరవింద సాహిత్యాన్ని సామాన్యుడు అధ్యయనము - యుట సాధ్యము గాదనుమాటయు నిజమే. బృహద్గ్రంథముల కొనుగోలు - యుటయు అతనికి కష్టసాధ్యమే.

# విషయ సూచిక

## 1ST SERIES – 1వ భాగము



## 2ND SERIES – 2వ భాగము



## 3RD SERIES – 3వ భాగము

1st Edition : 21-2-1980

Copies : 500 



Published by : Sri Divya Mata Shata Jayanti
Grandha Prachurana Samiti,
Hyderabad.

C/o. Institute of Human Study,
2-2-4/1, University Road,
Hy erabad-500768.

Price : Rs. 3-00

Printers : Su ers an Printers,
Esamia Bazar,
Hy erabad-500027.

# ప్రమాత ; మనతల్లి ; దివ్యమాత

మనము, మన మనోదౌర్బల్యములో దివ్యమాత యందలి దైవాంశను మరచి, ఆమెను మామూలు తల్లిగా భావించుచున్నాము. దివ్యమాత అను గొప్ప పేరులోని, మాత అను చివరి మాటనే గట్టిగ పట్టుకొని, దానితో సమానమైన ప్రాముఖ్యముగల దివ్య అను పదమును తెలియక విడనాడుచున్నాము. సాధారణముగ మానవుడు తన తల్లి నుండి ఎట్టి మానవ ప్రేమను కోరుచుండునో అట్టి మానవ మాతృప్రేమను మాత్రమే అపేక్షించుచున్నాము. ఆమె యెడల మనప్రేమ అజ్ఞానభూయిష్ఠమైన మానవప్రేమ మాత్రమే అయి యున్నది. ఆమెను అహంకారపూరితమైన కోరికల ఆకలిని తీర్చు భౌతిక మూర్తిగా ఎంచి, ఉద్రేకముతో ప్రలోభముతో, తానే పొందవలెనను స్వార్థ పరాయణతతో మాత్రమే ఆమెను ప్రేమించుచున్నాము.

ఆమె, మాత యనుమాట నిజమే. కాని ఆమె దివ్యమాత అయి యున్నది. మనము ఆమెను దేవ మార్గములో ఆరాధించవలెననియే గాని మానవ పద్ధతిలో రవలెనని యామె యభిమతము కాదు. మనము దైవమార్గము ననుసరించునప్పుడే, పరమోన్నత మైనట్టియు, అతి నిగూఢ మైనట్టి ఆ స్థానము నందుకొనగలము. అప్పు మనము, సంపూర్ణముగను సర్వతోముఖముగను స్వీకరించి ఆమె యనుగ్రహోపేతమైన ఆనందాబ్ధియందు నోలలాడగలము. మానవ పద్ధతిలో ఆమెను ప్రేమించినచో, మానవ భావమునందలి యల్పత్వమునకు సంకుచితత్వమునకును బద్ధులమైపోవుదుము. మానవ విధానము సాధారణముగ గారాబముచే చెడిన బిడ్డని గతి వంటిది. మన హృదయాంతరాళము నందొక యథార్థ

మైన ప్రేమ బిందువున్నను, అది యపారమైన అజ్ఞాన పంకిలములో మునిగిపోయి యుండును. ఆ మలినము మనల నావరించి మన ప్రేమ కాలంబనమైన మూర్తిపై కూడ ప్రసరించును.

ఆమె మాత అయినప్పటికిని, యదార్థముగ దివ్యమాతయే. ఆమె దివ్యత్వము, మనకు ఎక్కడనో దూరముగానుండి, సంబంధములేక పరబ్రహ్మతత్వము వలె మనతో ప్రమేయము లేక నిస్సంగత్యములో నుండుట కాదు. నిజమునకు దివ్యమాత మానవ స్వభావముగల మాతృమూర్తి కంటే ఉత్కృష్టమైన మాతృభావము కలది. మానవాత్మకమైన తల్లి, విశ్వజననితో పోల్చిన ఒక అల్పమైన ప్రతిధ్వని వంటిది లేదా సుదీర్ఘమైన ఛాయను బోలినది. లేదా కొన్ని సమయములలో సృష్ట్యాది లోని యదార్థమైన తల్లియొక్క వికటస్వరూపముగ కానవచ్చును.

దివ్యమాత, ఉన్నతమైన పరాత్పర స్థానమునందుండియు, మానవ భూమికకు వంగి, మనను అందుకొనగలదు. మనతో కలసి ఏకమై, మనయందు ప్రవేశించి, మన అంతరాత్మతో ఏకమై మనకు మార్గదర్శినిగా, సహకారిణిగ, నగును. ఆమె మన చేతిని పట్టుకొని — మనము పట్టుకొననిచ్చినచో — మన అల్పమైన మానవత్వమును అతిక్రమించి, ఆమె దివ్యప్రేమయను అద్భుతప్రకియ ద్వారా, తనకు సహజమైన పరతత్వములోనికి ర్చు విధానమును ప్రబోధించును. దీనికి మన ప్రేమభావము అనుకూలముగా నుండవలెను.

మనము ఆమె యొక్క ద్విగుణాత్మకమైన (1) ఈ సత్యమును జ్ఞాపకముంచుకొనవలెను. ఆ ప్రేమ రెండు బాహువులై ఆలింగనము సు కొని మనలను ముద్దాడినప్పుడే మనము ఆమెయొక్క నిజమైన బిడ్డలము కాగలము.

3

1. ద్విగుణాత్మకమైన సత్యమనగా (1) దివ్యాత్మకమైన మాత మానవాత్మకమైన మాత—ఈ రెండు భావములను మనము మరువక స్మృతిపథమునందుంచుకొని, ఆ దివ్యభావభరితమైన ప్రేమతో మన మామెను ప్రేమించవలెను.

ఈవ్యాసము 1958వ సంవత్సరము "Sri Aurobindo Patha-mandir"లోని "ప్రేమాంజలి" అను శీర్షిక క్రింద 3—4 పేజీలలో ప్రచురింపబడినది.

# విందు

శ్రీమాత, తన "ప్రార్థనలు—ధ్యానములు" అను గ్రంథములో ఇట్లు పలికెను :—

"నేను అతిప్రేమతో, మిక్కిలి శ్రద్ధతో తయారుచేసిన యీవిందు మానవుడు నిరాకరించినందున, నేను భగవంతునినే ఆరగించ వలసినదిగా ప్రార్థించినాను.

హే ! ప్రభూ నీవు నా ఆహ్వానము నంగీకరించి, నాముందు కూర్చొని, అల్పమైనట్టియు, బహుదీనమైనట్టియు, నా నైవేద్యము నారగించి, అందుకు ప్రత్యుపకారముగ నాకు సమగ్రమైన చరమ మోక్షము ప్రసాదించినావు.

(3-9-1919 దినాటి ప్రార్థన)

మానవునికై సిద్ధము సినట్టియు, మానవుడు నిరాకరించినట్టియు ఈవిందేమిటి ? అది ఈభూలోకమునందు దివ్య వనము గాక మరేదియును కాదు. అది దేవతలనుభవించుచున్న అమృతత్వము, వెలుగు, శక్తి, ప్రేమ, ఆనందములతో కూడిన జీవనము. మానవునకది అతీతమై అందరానిదని అతడు నిరాకరించినాడు. మానవుడు మట్టికి కట్టువడి, అల్ప వి అయిన కారణము , అల్పవిషయములను, అల్పమైన బౌతిక పదార్థములను మాత్రమే గ్రహించి పట్టుకొనగలడు. ప్రప్రథమమున ఎందుకు నిరాకరించెను ? అజ్ఞానము వలన తెలియక. మానవుడు, మృత్యురహిత వనము, దివ్యత్వము, కటిబాధనెరుగని పెలుగు, దుఃఖరహిత ప్రేమ, అగోచరము, ప్రశాంతము ప్రకాశమానమైన శక్తి ఒకటి కలదని

యూహించుటకు కూడ సామర్థ్యములేనివాడై యున్నాడు. అతనికి తెలియదు; కాని అహంకార మెక్కువ. తనకు గల స్వల్పమైన జ్ఞానముతో, లేశమాత్రమైనశక్తితో, గుడ్డిదైనసర్వజ్ఞతతో అహంకరించుచుండును. ఈ అజ్ఞానమునకును, అహంకారమునకును తోడువానికి, తిరుగుబాటుతనము కూడ కలదు. ఎందువలన అనగా, తనకు కలిగిన సగము మెళకువలో సంభవించిన ప్రాథమిక తనతో అందరాని విషయములు అందుబాటులోనికి వచ్చినను ఊర్థ్వలోకముల యొక్క నీడలు తన ఆవరణలోనికి చొరబడినను ఆందోళనచెంది, వాటిని గుర్తించలేక పోవుటయేగాక, నిరాకరించి, త్రోసిపుచ్చి, దూషించును.

దివ్యమాత దుఃఖోపశమనమును, మోక్షమును ఇచ్చును. భగవదనుగ్రహమునకివి చాలచిన్న విషయములు. అతి నిరాడంబరమైనట్టియు, సహజమైనట్టియు, సాధారణమైనట్టి వీటినెందులకు మానవులు నిరాకరింతురో చాలా ఆశ్చర్యము కదా!

ఆమె తీసుకొనివచ్చిన బహుమానము, మానవునకు పనికిరానిచో, ఆమె తిరిగి దానిని ఎవరినుండి తెచ్చినదో ఆ ప్రభువున యిచ్చివేయును. అన్నివస్తువులును ఆ పురుషోత్తమునకు చెందినవే. ఆమె కూడా ఆ యీశ్వరునితో నొకటైయున్నకారణము, ఆ పురుషోత్తమునకు చెందినదే.

ఈ చర ద్వారా దివ్యమాత, మానవుడు తన కార్య కలాపములలో ఏభావము ఎట్టి ప్రవృత్తి కలవాడై యుండవలెనో ప్రబోధించుచున్నది. మనము మనయొక్క ప్రతికార్యములోను, సర్వదా భగవంతుని స్మరించుచుండవలెను. భగవంతునకు విన్నవించుకొనుచుండవలెను.

మనము విశ్లేషించినచో, తుదకు అన్నికర్మలు అపరాత్పరు నుండి యావిర్భవించును గనుక వాటిని, అపరాత్పరునకే అర్పించి, ఎక్కడ నుండి వచ్చినవో అక్కడికే జేర్చవలెను. దీనియందే స్వేచ్ఛ, దివ్య నిస్సంగత్వము కలవు. ఇవియే మానవుని భగవంతునితో ఐక్యమును పొందుట కవసరమైన లక్షణములు.

శ్రీ నళినికాంత గుప్త గారి రచనల సంపుటము IV నందు 247_248 పేజీలు .

శ్రీ మాత భౌతిక కాయము వెనుకటి సృష్టిలోనిదై యుండెను. ఇది నూతన శరీరమున కొక పీఠముగ మాత్రమే గ్రహించబడెను. దాని పని అది పూర్తిగా నెరవేర్చినది. నూతన శరీరము వచ్చును.

ఇది మనకు పరీక్ష సమయము. మనము ఆమె యందెంత విశ్వాసము కలవారమై యుందుమో, ఆమె చైతన్యమూర్తి యందెంత నమ్మిక కలవారమై యుందుమో, తెలియుటకు పరీక్ష సమయము.

ఈ శరీరమునే పునరుద్ధరించినచో, పూర్వపు కష్టములనే తిరిగి కల్పించుట కాగలదు. ఈ శరీరములో నుండగనే దానియొక్క బాధల నెంతవరకు తొలగించుటకు అవకాశము కలదో అంతవరకు తొలగించ బడెను. అంతకు మించి అవకాశము లేదు. క్రొత్త మార్పునకు క్రొత్త మార్గము నవలంబించ వలసియున్నది. ఆ పథములో "మరణము" మొదటి మెట్టు.

(2)

మధుమయీ మాత ! నీ భౌతిక శరీరము పూర్వ సృష్టికి చెందినది. ఎందులకనగా, నీవు నీ బిడలతో కలసి ఉండ నిశ్చయించితివి. నీవు నూతనముగ సృష్టించుచున్న శ రమును, ఈ శరీరము పట్టి ఉంచవలసి యుండెను. నీవు కోరిన పనిని ఈ శరీరము నెరవేర్చినది. నీవు నీ నూతన శరీరముతో వచ్చెదవు.

నీ బిడ్డలయొక్కయు, ఈ ప్రపంచముయొక్కయు, ఆక్రందన, ఆకాంక్ష, ప్రేమ, దీక్షలు, కృతజ్ఞతాపూర్వకముగా, నీ పాదారవిందలములవద్ద అర్పింపబడినవి.

# ఒక కెనడా దేశస్తుని ప్రశ్న

"యోగ సమన్వయ మార్గదర్శి" (A Practical Guide to Integral Yoga) అను గ్రంథము నందలి 179 వ పుటలో నీ క్రింది విధముగా వ్రాయబడియున్నది.

"భౌతిక పదార్థము భూమిపై సాధనా సంపూర్ణతకు, శ్రీ మాత భౌతిక సన్నిహితత్వము అనివార్యము. లేనిచో భౌతిక పరిణామము—అనగా బాహ్య జీవితముయొక్క పరిణామము—సాధ్యము కాదు."

ప్రశ్న :— శ్రీ మాత శరీరత్యాగము · సిన ప్రస్తుత పరిస్థితులలో, పై మాటలను మనమెట్లు అర్థము సికొనవలెను. ఆకాంక్షగల సాధకునకు పరిపూర్ణమైన పరిణామము ఇక అసాధ్యమేనా ? లేక, యోగ సమన్వయ మార్గములో భౌతిక పదార్థ భూమికపై శిష్యత్వము అంతరించినట్లు ఎంచవలసినదేనా ?

జవాబు :— భౌతిక పరిణామము యొక్క ప్రస్తుత కార్యకలాపము వాయిదా వేయబడినట్లే—కాని రద్దు · యబడలేదు.

కాని మనకొక అద్భుత విషయమంద యబడెను. అంతర సృష్టిలో అనగా సూక్ష్మభౌతిక పదార్థమునందు ఆమె మన నిమిత్తమై తానొక నూతన శరీరమును సృష్టించుకొని.ది. అది ఆమె బాహ్య భౌతిక శరీరమెంత స వమైయుండెనో అంత, స్పర్శగుణోపేతమై వించు చున్నది ; కాని భౌతిక శరీరమునందలి స్థిరమైన కాఠిన్యతగల పదార్థమును

కలిగిలేదు. ఆమె చివరికాలములో "అంశములు"(notes) (1) అను శీర్షిక క్రింద ప్రచురించిన వాటిలో, మార్పుచెందిన తన నూతన శరీరమును గురించి సూచించినది. అందు ఆ నూతన శరీరము తనకెట్లు కనిపించినదో వివరించినది. ఆ శరీరమును ఆమె దీర్ఘకాలముగ శ్రమించి నిర్మాణము చేసుకొనెను. ఒకరూఢమైన రూపములో తయారు చేసికొని, మనకును, మానవ ప్రపంచమునకును ఇచ్చినది. ఈ నూతన శరీరమును, తన భౌతిక కాయమను తెరవెనుక తయారు చేసినది. ఈ నూతన పదార్థమును—శరీరమును, భౌతిక శరీరములో ఇముడ్చుటకు, లేదా బలవంతముగా అదిమి పెట్టుటకు ప్రయత్నము చేసినది. కాని భౌతిక పదార్థము గాని, మానవ స్వభావము గాని అందులకు సిద్ధముగా లేకపోయెను. పదార్థము దానిని పరుల వస్తువుగ విజాతీయ వస్తువుగ పరిగణించి త్రోసిపుచ్చెను. ఆకారణముచే, ఆమె ప్రయత్నములో భౌతిక కాయము విచ్ఛిన్నమాయెను— భరించలేక బ్రద్దలయ్యెను. అది వేరొక కథ.

ఆమె నూతన శరీరము శక్తి సౌందర్యములతో రాజిల్లుచు సజీవమైయున్నది. ఇంకను మనలో మనచుట్టును ప్రపంచములో అవిరామముగ పని యొచునే యున్నది. భౌతిక శరీరము నందావిర్భవించుట యను పరమావధివరకును పని యొచునే యుండును.

మన కర్తవ్యమేమనగ ఆ స్వర్ణమయమాతను మన అంతరంగములో దర్శించి బాహ్యముగను అంతరమునను, మనము ఆమె కాంక్షించిన బంగారు బిడ్డలమగుటకు యత్నించుచుండవలెను.

(1) అరవిందులు అంతర్మనస్సు, అంతఃప్రాణము, అంతః పదార్థములను గురించి నుడివి యున్నారు. ఈ మధ్యనే క్రీడాస్థలము

నందు ధ్యాన సమయములో శ్రీ అరవిందుల గ్రంథము నందలి ఆ భాగము చదువబడెను.? (2) ఆ నూతన శరీరము, ఆ కనకమయ కాయము, అంతర్మనస్సు అంతః ప్రాణము, అంతఃపదార్థముల నుండియే తిరిగి నూతనముగా రూపొందించ బడినది. ( ) మాత మనపై ప్రసరించిన అపారమైన యనుగ్రహమునకు కృతజ్ఞులమై, నిండైన ప్రేమతో ఆమె సాన్నిధ్యమును మన అన్నమయ పురుషునిలో నింపి నిలుపుకొని ఆమె · యదలచిన నూతన సృష్టికి అనుమతించి సహకరించుటయే మన కర్తవ్యము.

(2)

వెనుకటి తప్పులను సరిదిద్దుకొనుట కిదియే సమయము— తప్పులు సియున్నాము : నిజమునకు ప్రమాదకరమైన పొరపాటులవి. ఇంతకాలము ఆమె భౌతిక దేహము మనలను రక్షించినది. ఆమె శరీర మొక కవచముగ పని సినందున మనము మన కర్మల ఒత్తిడికి పూర్తిగా లోను కాలేదు. వాటి బాధలను పూర్తిగా అనుభవించ నవసరములేక పోయెను. ఆమె భౌతిక కాయము మన కర్మలయొక్క తీవ్రమైన పరిణామ ప్రవాహము నడ్డుకొని, భంగపఱచి వాటి దుష్ప్రభావములను చాల వరకు, అనగా తగ్గించుటకు, వీలైనంత వరకు తగ్గించెను, ఆమెశరీరము మన భారమును భరించి, మన మనుభవించవలసిన క్లేశమును నివారించెను. మానవజాతి గాని ఈ భూలోకము గాని ఆమె భౌతిక శరీరము ప్రసాదించిన అనుగ్రహ పూర్వకమైన రక్షణను ఎరుగవు. ఆమె యొక్క ఆ దివ్య శ ·రము ఈభూమిపై సాక్షాత్కారము కానియెడల మానవుడును, ఈ లోకమును నశించి లయమైపోయి యుండెడివి.

ఈ భూలోకము మిగిలి నిలబడుటకును, మానవజాతికి ఒక నిర్ణీతమైన భవిష్యత్తు యేర్పడి యుండుటకును ఆమె భౌతికకాయము సాధించిన కృషియే ప్రధానకారణముగ మనము తెలుసుకొనవలెను. భవిషత్కాలమునందలి రూపములను స్థిరముగ స్థాపించుటకై ఆమె శరీరము కొంచెమధిక ప్రయత్నము - సెను. కాని అది జరుగుటకవకాశము లేక పోయెను. మానవజాతియు ప్రపంచమున్ను తామీయ వలసినంత సహకారము నిచ్చి యుండలేదు. మన కర్ణపుటములలో మ్రోగుచున్న ఆమె వాక్కులు "మానవజాతి ఆధ్యాత్మిక పరిణామమున కంగీకరించినచో" అనునవి మనస్మృతి యందున్నవి కద. ఆమె యాశించిన ఆ స్వల్పమైన విషయము కూడ మనము ఆమె శరీరమునకందించలేక పోతిమి. మన కందరకును ఆమె అనుగ్రహముననే సులభముగ, శ్రమ లేకుండగ ఆమె భౌతిక శరీరము ప్రాప్తించినది మనము ముంగిటకు మన ద్వారమునకు వచ్చిన అమూల్యమైన వస్తువు విలువనుకట్టలేక కోల్పోతిమి. దాని వినియోగము తెలియక, దాని లబ్ధి నెట్లు పొందవలెనో గమనించలేక పోతిమి. ఈ విషయమును ప్రస్తావించుచు ఆమె అనేక మారులు చింతాక్రాంతయై చెప్పి యుండెను. మిక్కిలి గారాబము- , ఆస్తిని దుర్వ్యయము, వ్యర్థము - సిన పుత్రునివలె మనము కూడ మన ధనాగారమును గుల్ల సితిమి.

ఇది కడు శోచనీయము. కాని; ఆమె మన విషాదమునకు తావీయలేదు. ఆమె రక్షణ శక్తికి మూలాధారమైన, తనయొక్క స వమైన చైతన్యమును, ఈ ప్రాపంచిక వాతావరణములో స్థిరమైన రూపమును దాల్చి మనయొక్క, ప్రతివ్యక్తియొక్క వాతావరణములోను నిలిచి యుండునట్లుగ సియున్నది. మనము కృతజ్ఞతాపూర్వకమైన దృష్టితో చూడవలెను. మనము ఎక్కుటకు నిచ్చెన తీసివేయబడెను. కాని ఆమె

మనకు ఎక్కువ సన్నిహితముగానే యున్నది. మనము కొంచె మెగర గలిగినచో ఆమె తులలో తిరిగి పడగలము.

ఇక, మనకు ఆమె భౌతిక శరీర సాహాయ్యము—దేనిపై పూర్తిగ నాధారపడి మన ముంటిమో అది—ఇక లేదు. ఆమె చేతనకు అలంబనముగ, ఆమె నిజమైన అంతర్గత తత్త్వస్వరూపమునకు ఆధార ముగ–ఆమె అంతస్సాన్నిధ్యము, సజీవమైన అంతరూర్తికి—ప్రతీకగ, ప్రతినిధిగ ఆమె బౌతికశరీరము విరాజిల్లెను. కాని మనము ఆమె బౌతిక శరీరముయొక్క సహవాస సహకారముల పూర్తి లబ్దిని శ్రద్ధలేక పొంద లేక పోతిమి. ఇప్పుడు మనకు మిగిలి దొకటే పద్ధతి అది చాల క్లేశ భూయిష్టమైనది. తనా భూమికలను, పిల్లలు ఆటలలో నిచ్చెన మెట్లెక్కి దిగినట్లుగ, ఆ తల్లి బౌతిక శరీరములో నుండినచో, మనము తేలికగా ఆరోహించి అవరోహించగలిగి యుండెడి వారము. ఇప్పుడు మనంతట మనము ఆ స్థానము నందుకొనవలెనన కొంత శ్రమతో కూడిన తపస్సు యవలెను. మన బాహ్యజీవితమును బౌతిక చేతనను, ఆమె చేతనా స్థానములోనికి కొనివచ్చుటకు తీవ్రమైన కృషి యవలెను. ఆమె బౌతిక శరీరము మనకు (నిరపేక్షముగ) సాహాయ్యమును రక్షణ నొసంగినది. ఇప్పుడు అవి బేషరతుగ గాక, కొన్ని షరతులకు లోనై యుండును. ఆ షరతులేవన, అసమ్మతియెరుగని మన సమగ్రమైన సహ కారము, స తనత్వ సంతోషములతో నిండిన తోడ్పాటు. కాని ఆమె దివ్యానుగ్రహమెప్పుడును ఉండియే యుండును. మన క్లిష్టసమయము రానుండగా ఆమె మనలను ఒక సూటియైనప్రశ్న అడిగెను—"మీరు సిద్ధముగా నున్నారా ?" మనము సాహసమును డాంబిక ఉదారత్వమును ప్రదర్శించుచు, అనాలోచితముగ "ఆ మేము సిద్ధముగా నున్నాము."

అని బదులు పలికితిమి. కాని నిజమునకు మనము అందుకు సిద్ధముగ లేము.

ఇక మనయొక్కయు, ప్రపంచము యొక్కయు కర్తవ్యమేమన, మనము అందుకు సిద్ధమగుటయే. అనగా మన బౌతిక తన బౌతిక పురుషులను, గత కాలపు ప్రతీకార పద్ధతులనుండి తొలగించి, ఆ మాతృ - తనతో,—మనను ఆవరించి ఆలింగనము సుకొను ఆమె తనతో—నింపుటకు యత్నించవలెను. అట్లు ః సినచో మనకు ఇంకొక పిలుపు వచ్చినపుడు— నిజమునకు ఆ పిలుపు సర్వదా ప్రత్యక్షమై యున్నదికద )మనము "మేము సిద్ధముగా నున్నాము." అను మాటను సత్త్వ శుద్ధి ( చిత్తశుద్ధి )తో నుడువ వచ్చును.

# ౨ మాత ఉన్నది

అది ప్రళయము కానిమ్ము, మహా ప్రళయము కానిమ్ము ! అంతయు నశింపదు. సర్వనాశనము కానేరదు. ఏదియో కొంత మిగిలి యుండును. అది మృత్యువున కందరానట్టియు మరి దేని తను ముట్టరానట్టియు అమృత స్వరూపమైనదివ్యాంశ. అదియే నీ యందలి చైతన్యాత్మకమైన మాతృ అంశ, నీయందవతరించి వ్యక్తిత్వము నందిన మాతృ చైతన్యకళ.

నిజముగ ఆమె యంతరాత్మను అజ్ఞానాంధకారమునుండి ఉద్ధరించి నీయందొక సజీవమైన చైతన్య తత్వమును నెలకొల్పినది. అదియే ఆమె ప్రధాన కర్తవ్యము. ఆ పనిని ఆమె పూర్తిగ నెరవేర్చినది. నీ ఆత్మ సర్వదా నీయందే వుండినదనుమాట నిజమే. అది దూరస్థమై అంతరిక్షమునందు మినుకు మినుకు మను నక్షత్రమువలె, మానవుని ఎరుకకు అగోచరమై, స్తబ్ధమై, అల్పమై విలసిల్లు ఒక కాంతి కణముగా నుండెను. అద్దానిని ఆమె, దగ్గరకు ౼సుకొనివచ్చి, మన సజీవమై క్రియాత్మకమైన చైతన్యములో నెలకొల్పినది. ఆమె ఆయంతరాత ను, అజ్ఞానపుటడుగు భాగములనుండి పైకి కొనివచ్చి, లేక అస్పష్టము రూప రహితమైన ఊర్ధ్వ భూమికలనుండి క్రిందికి కొనివచ్చి, మన అంతరంగ మునందు నెలకొల్పి స్థిరవాస మేర్పచినది. దానికి నామరూపములు కల్పించి, వ్యక్తిత్వమునిచ్చి పోషించినది. ఈ విషయమును మనము నిత్యముగాని, తరుచుగగాని గుర్తించక పోవుటకు కారణము ఇంద్రియ సంబంధమైన బాహ్యవ్యాపారమను తమః పేటికనుండి మన మింకను

పూర్తిగ బయటపడి, ఉన్ముఖులము కాకుండుటయే. అయినప్పటికి ఆమె మనహృదయాంతరంగమునందు నిలిచి, మన అజ్ఞాన భూయిష్ఠమైన మూర్ఖతలు అపమార్గములను లెక్క యక, వాటి మధ్యనుండియే అంతరంగిక సారథియై మార్గదర్శనిగ పని యుచున్నది.

ఆమె కార్య క్రమములో రెండవ భాగము, ఈ యంతరాత్మ చుట్టు నుదాని నభివ్యక్త పరచు అన్నమయకోశము, అనగా భౌతిక శరీరమును నిర్మించుట. ఈ సందర్భములో ఆమె కృషి మూలతత్వమున కొక సుస్థిర మైన దివ్యరూపము నిచ్చుటయే. ఆత్మ ఉన్నది ; కాని ఒక దేవత దిగి వచ్చి అందు నివసించవలెను. దేవత—దివ్యశక్తి—అనగా (శ్రీ) మాత యొక్క ఒకానొక విభూతిమూర్తి అందు ప్రవేశించి, ఆయాత్మతో సమ్మేళనము పొందవలెను. బాహ్యదృష్టికి, ఆమెపని అసంపూర్తిగ ఆగిపోయినది.

(శ్రీ) మాత యత్నముయొక్క ప్రయోజనమును లక్ష్యమును వ్యక్తిగతమోక్షము లేదా కొందరు వ్యక్తుల ముక్తిమాత్రమే కాదు. అది మొత్తము మానవజాతినే, అనగా పెక్కుమంది మానవులనందఱిని జాతిలో ఒక విశిష్టమైన భాగమునే ఉద్ధరించు నిమిత్తముద్దేశింపబడెను. మానవ ప్రకృతి యందే పరిణామమును సాధించుటకై అవతరించు ఆ తేజః ప్రభావమును ధరించి నిలబెట్టుకొనుటకు మానవ ప్రకృతి శక్తి గలదై యుండవలెను. అందులకు మానవ - తన పెరిగి, ఉన్నత స్థితినందు కొనవలెను. అట్లు కానిచో మానవ స్థానమును సూచించు వ్యక్తిగతమైన చైతన్యము, భౌతిక పదార్థ చైతన్యములో భాగమగుట , ఆ పనిని చేయలేదు. భౌతికచైతన్యమేగాక, పదార్థనిర్మాణము కూడ రూపాంతరము చెందవలెను.- మానవ శరీరము ఒక వ్యక్తియొక్క, మానవశరీరము

సమగ్రమైన పరిణామ భూమికల నందుకొను నప్పుడు, దాని ప్రభావము దాని ఛాయలు మొత్తము జాతిలో కాకపోయినను, తగు మాత్రమగు ఇతర వ్యక్తులలో కూడ ప్రతిబింబించుచునే యుండును. లేనియెడల పరిణామ ప్రయోజనమైన సర్వతోముఖ సమష్టి మార్పు సిద్ధించ నేరదు. ఎవరైన ఒకానొక వ్యక్తి అతీత మానసిక దివ్య శరీరమును పొందిన యెడల అది ప్రకృతివైపరీత్యమనిపించుకొనును. ఒక అద్భుత వి షము, లేదా, ప్రకృతియొక్క అసంబద్ధ సంఘటనా వి షమనిపించుకొను. ఉన్నత స్థానము నందుకొనిన మానవులు కూడ దానితోగల సంబంధ మును తెలుసుకొనజాలరు.

అందువల్ల బౌతిక ప్రకృతిని ఈ లక్ష్యముతో 'తర్ఫీదు' - య వలెను. ప్రపథమముగా బౌతిక పదార్థము నందలి బౌతిక - తనను, తదుపరి పదార్థ అపక్వ మూలద్రవ్యమునే పరిణామమునకు సిద్ధము చేయ వలెను. ఇదియే వితములో, తొందరగా, వెంటనే సాధించ వల సిన కార్యక్రమము.

(2)

() మాత బౌతిక కాయముయొక్క తుది పరిణామమునకు బౌతిక - తన సిద్ధముగా లేదని, నేను చెప్పినాను. అనగా శరీరము నందలి బౌతిక పదార్థము యొక్క సారవంతమైన వస్తువు (Substance) సిద్ధ ముగా లేదు. అందువల్ల ఆపదార్థములోనికి దిగి వచ్చుచున్న పరిణామాత్మక మైన శక్తిని గ్రహించి ఇముడ్చుకొన లేక ఛిన్నమైనది. అట్లు ఛిన్న మగునప్పుడు బౌతిక పదార్థముయొక్క చిట్టెము గట్టిన ఉపరిబాగమును దించి యుండవలెను. దీని ఫలితములను కాలము ప్రదర్శించ గలదు.

మిగిలి పోయిన మనము మట్టుకు పునః ప్రారంభముచేయవలెను. మొట్టమొదటి నుండి ప్రారంభింతుము గాక! ఆ తల్లి ప్రపథమముగా శ్రీ అరవిందుల సన్నిధిలోనికి వచ్చినపుడు చేసిన విధానము మనకు జ్ఞాపకమున్నది కదా! అప్పటి వరకు ఆమె తనకున్నదనుకొనిన వ్యక్తిత్వమును—సంపాదించిన భావములు, విద్యలు సాధించిన సిద్ధులు మొదలుగాగల వానినన్నింటిని, పూర్తిగా తుడిచివైచి, తన చైతన్యము నొక పరిశుద్ధమైన ఫలకము సుకొని, పూర్వజీవితమును, వృత్తులను, సంపూర్ణముగ నెట్టివైచి, అప్పుడే పుట్టిన పసిబిడ్డవలె శ్రీ అరవిందుల పాదముల వద్ద ప్రసన్నురాలాయెను. మనముకూడా అట్లె మన శశ్వాత్మతో కాలము నెదుర్కొందుము గాక. ఆ శశ్వాత్మ మనలోని ఆ మాతృ చైతన్యముతో ప్రకాశించుచున్న మాతృ సాక్షాత్కారమే.

"మీకు తెలియును గదా! నేను ఇది మీకు చదివి వినిపించుటకు సంకోచించుచున్నాను."

ఒక విధముగా బాగుగానే యున్నది. కాని........

నిజమునకు ఇది మనస్సుకు గాని, బుద్ధికి గాని అందరాని విషయమైనప్పటికి, మనస్సుతోను బుద్ధితోనే తెలుపుచున్నాను. ఈ విషయము మనస్సుకు అతీతమైనది, బుద్ధికి పరమైనది. విశ్వమునకే అతీతమైనది. దీనిభావము, ప్రభావము కాలక్రమేణ విశదము కాగలదు.

అంతవరకు మనము యదగిన పని, పవిత్రమైన విశ్వాసముతో మన ఆత్మయొక్క—అనగా మనలో ఎడతెగక ఎల్లవేళల, సుస్థిరముగా నెలకొనియున్న ఆ తల్లి ప్రత్యక్ష సాక్షాత్కారాకాంక్షతో నిండి ప్రశాంతముగ నుండవలెను.

# జంట ప్రార్థనలు
## ( Second Series )

"భగవన్ ! నేటి ఉదయము నీవు నాకొక వాగ్దానము నిచ్చి యుంటివి. అది ఏమన, నీవు సంకల్పించినకార్యసిద్ధి చేకూరునంతవరకు, నీవు మామధ్య ఒక చైతన్యముగా ఉండి, మమ్ము ఉద్దీపితులను చేసి, నడిపించుటయేగాక, క్రియాత్మకమైన సాక్షాత్కారముగా, నిలిచియుందు నని, దృఢమైన మాట నిచ్చియుంటివి. అసందిగ్ధమైన పదములలో ఈ భౌతిక పదార్థము కూడ పరివర్తనము చెందువరకు, ఈ భౌతిక పదార్థ భూమికను వదలక, యిందే నీ సర్వశక్తులతో కూడిన మూర్తితో నిలిచి యుందునని వాక్రుచ్చియుంటివి. ప్రభో ! నీ అద్భుత సాన్నిధ్యమునకు మేమర్హత కల్గి యుందుము గాక ! ఇటపై మా సర్వస్వము నీ మహో న్నతమైన కార్యసిద్ధికై కేంద్రీకరించుటకు ఏకైక సంకల్పము కలవారమై దీక్ష వహింతుము గాక !"

ఇవి శ్రీమాత, శ్రీ అరవిందులను గురించి చేసిన ప్రార్థనలు- ఎంత అద్భుతములు, ఎంత తీక్ష్ణములు, ఎంత సత్య సమ్మతములు. ఆమె యొక్క బిడ్డలమైన మనము ఇప్పుడు వెనుతిరిగి ఆ ప్రార్థనలను, శ్రీ తల్లిగారి మధురాతి మధురమైన ఆత్మ అర్పించుకొనుచున్నాము.

శ్రీ తల్లిగారు స్థాపించిన నూతన సృష్టి, తల్లిగారి భౌతికకాయము అదృశ్యమైనంత మాత్రమున; నశించిపోలేదు, ఆ సృష్టి ఒక సత్య స్వరూపమై యున్నది. అది భూవాతావరణములో సుస్థిరముగా పాతుకొని, చిరస్థాయిగా నిలిచిపోయినది. అది ఒక జడ నిర్మాణము కాదు, సజీవమై వృద్ధినొందుచున్న సత్త్వము. అది ఈ ప్రపంచ వాతావరణములో ఒక

జడ ప్రతిమగా గాని, లేదా ఒక వస్త్రముపై గీయబడిన నిర్జీవమైన బొమ్మగా గాని లేదు. అది ఈ ప్రపంచములో సజీవమై పెరుగుచున్నది. అది తనకు తాను జీవించి పెరుగుట మాత్రమేగాక తన ఉనికిగల వాతావరణమునే నూతన పరిమాణములలో సజీవముగా వృద్ధిపొందించుచూ, ఆ నూతన సృష్టియొక్క సత్యతత్త్వముల కనుకూలమైన పరిణామము లను తీసికొనివచ్చుచున్నది. అది పెరుగుచున్నది. ప్రత్యేకముగా క్రిందికి పెరుగుచున్నది. అనగా భౌతిక రూపాంతరమునకు లేదా అవతరణమునకు వీలుగా క్రమక్రమముగా వ్యాపించుచున్నది. అది మన పూర్వ ఋషి పుంగవులు చెప్పిన అశ్వత్థ వృక్షమువలె వేళ్ళు పైకియుండి ఆకులు, కొమ్మలు క్రిందికి విస్తరించుకొనుచున్నది. ఆ వృక్షమునకు జీవశక్తి పైనుండి క్రిందికి ప్రసరించుచున్నది. తప్పక కాలానుక్రమములో ఆ అంతఃసృష్టియొక్క బాహ్య స్వరూపము భౌతిక పదార్థమునందు ఆవిర్భవించి నెలకొనగలదు. అది ఈ పాంచభౌతిక ప్రపంచమును స్పృశించి ఈ నేలపై ఒక అద్భుత సృష్టిగా నిలబడగలదు. బహుశః ఆ కార్య సాధనలో అనేక కష్టములు, అరిష్టములు సంభవించవచ్చును. కాని, పరిస్థితులు అనుకూలించి, భగవదనుగ్రహము సహకరించినచో సాధన యందలి కష్ట నిష్ఠురముల తీవ్రత కొంతవరకు తగ్గవచ్చు. ఏమైనప్పటికి ప్రయత్నమును, సిద్ధియును నిర్దిష్టములై యున్నవి. ఎందువల్లననగా అవి దైవముచే భౌతిక పదార్థ చైతన్యములో అనివార్య విధిగా నిర్ణీతములై యున్నవి.

సరే ! ఇది, (శ్రీ) తల్లిగారు ఆమె పక్షములో సమగ్రముగా, పరిపూర్ణముగా కొనసాగించుచున్న కార్యక్రమము. కాని; మన సంగతేమి ? ఈ కార్యక్రమమునందు మన భాగమెంత ? ఆమె బిడ్డలమైన

మనము, ఆమె పనిలో భాగస్వాములమై, ఈ దివ్య సాక్షాత్కారమునందు విలీనము కావలెను. శ్రీ తల్లిగారే మనకు మనము యివలసిన సేవా కార్యక్రమపు బాటలను సూచించియున్నది. ఈ క్రింద వివరించు, ఆమె సందేశము అట్టిదే.

— ఇక నుంచి మా సర్వస్వము నీ మహోన్నతమైన కార్య సిద్ధికై కేంద్రీకరించుటకు ఏకైక సంకల్పము కలవారమై దీక్షను వహింతుము గాక!

ఇప్పుడు అప్పటి పరిస్థితులు మారి ఎక్కువ క్లిష్టతరమైనవి. శ్రీ అరవిందుల నిర్యాణానంతరము, కొంత కాలమునకు శ్రీమాత మనకొక సందేశమును కష్ట పరిస్థితులను సూచించు, మందలింపుగల ప్రబోధము నిచ్చియున్నది.

"శ్రీ అరవిందుల మహా సాహసోపేతమైన యోగ సమన్వయమును అనుసరించుటకు ఎవడైనను, సర్వకాల సర్వావస్థలయందు ధీరుడై యోధుడై యుండుటవసరము. కాని; ఇప్పుడాయన మనమధ్య భౌతికముగా లేని కారణము త, ప్రతివాడును వీరుడై యుండవలెను."

24-11-1952

ప్రస్తుత కాలములో శ్రీ తల్లిగారుకూడ లేని కారణము బాహ్యముగా మనము అనాథశిశువులమై యున్నాము. మనము చేయవలసినదేమి? ఉండవలసినదెట్లు? ఇక యోధులమై మాత్రమే యుండిన మాత్రమున చాలదు. మనము ఎట్లుండవలెను? వీరునికంటె ఉన్నతమైనవారము కావలె. యోగి కావలెను. యోగి ఎవరనగా, దివ్య·తన లేదా ప్రమాత చేతన కల్గిన వ్యక్తియే ఆ యోగి. పరి లించగా ఎంత నిజాయితీగా

ప్రయత్నించినను, నీవు యోగివగుట అంత సులభముకాదు. నేను మీకు ఇందుకు బదులుగా. మరియొక మార్గమును సూచించుచున్నాను.

కాలమానముగల మార్గములోనికి దుముకుటయే, అనగా శిశువుగా మారుటయే ( ) తల్లిగారి బిడ్డలమగుటయే ఆ మార్గము.



ఒక శిశువుగా, ( ) తల్లిగారికి ఆదర్శప్రాయమైన ఒక బిడ్డగా రూపొందుటకు, ఈ విషయమును మననము యుటకిచ్చుచున్నాను.



## "మాటలు ! మాటలు !! మాటలు !!!"

నేను మీ వద్దకు వచ్చుచుండగా మీరు శ్రీ మాతారవిందుల గ్రంథములలోని భావగుంభితమైన వాక్యములను, సూత్రప్రాయములైన ఉదాహరణలను, అందముగ గోడలపై చిత్రించుట గమనించితిని. ఔను. అదొక సుందరమైన చిత్రపటము– పద్యభాగము, నీతి వాక్యములు, శ్రేష్ఠవచనములు, అవి అన్నియు మనకు ప్రియమైన నిధులని వేరే చెప్పనక్కరలేదు. కాని వానిని చూచి ప్రశంసించి, ముందుకు పోయి, వాటిని మరచినచో అవి నిర్జీవమైన వస్తువులే– వట్టిమాటలే. నిజముగా వట్టి మాటలే. ప్రాణములేని అస్థిపంజరములే అవి. కాని; వాటి యందుగల జీవముతో, చైతన్యముతో సంబంధ మేర్పరచుకొని, నీ జీవచైతన్యమునందిమిడ్చుకొని, నీ జీవితమునందాచరించినప్పుడే వాటికి అర్థస్ఫూర్తియు, ప్రయోజనమును ఉండగలదు.

ప్రసిద్ధమైన ఈ లోకోక్తి మీకు తెలిసియే యుండును. "అ, ఆ లు అంతమొందించును– ఆత రక్షించును." అర్థములేని పలుకు, జడమైన

గుల్ల. అది మంత్రమైనను నిర్జీవమైనదే. దానిని ఆత్మ చైతన్యముతో నింపి రగుల్కొల్పబడనిచో అది వట్టి ధ్వని (గందరగోళము) అగును. కనుక; జడములై, నిర్జీవములుగా నున్న వాటిలోనికి మీ ఆత్మశక్తిని జొప్పింపవలెనని మీకిప్పుడు చెప్పుచున్నాను. ఎందువల్లననగా; చిన్నబిడ్డలు నిక్కముగా పరమాత్మ స్వరూపులే. పరమాత్మ అనగా నవచైతన్యము, సజీవమైన తేజస్సు. నే నిట్లనుట అతిశయోక్తి ఎట్లు కాదో వివరించెదను.

కొంతకాలముగా ఇక్కడ ఉంటున్న మీరు, కొంతకాలమువరకిక్కడున్న మఱికొందరు పిల్లలు మానవులలో ప్రం కాధికారముగల ఒక తెగకు చెందినవారు. ఇప్పుడు మీకిది అర్థముగాదు. కాని; మును ముందు ఒకానొక రోజున మీకది తెలియగలదు. మీరు ( ) తల్లిగారిని చూచియే యున్నారు. ఆమె స్పర్శభాగ్యమును పొందినవారు కూడ ఉన్నారు. కొందరు ఆమె కాయము ఇంకను నిలిచియున్న వాతావరణమున ఊపిరి పీల్చుకొనుచున్నారు. మరెక్కడను లేనట్టి తల్లిగారి చైతన్య విస్ఫులింగమిక్కడ కలదు. అది ఆమె ప్రాణము. ఆమె సూక్ష్మ చైతన్యము. దానిని మీరు మీ ఊపిరితో మీలోనికి గ్రహించినారు. ఇంకను గ్రహించుచున్నారు.

అది మీలో నున్నది. మీరు దానిని తెలిసికొని, దాని ప్రభావలబ్ధితో పూర్తిగా లాభమునొందవలెను. మీరు కేవలము శ్రీ మాతారవిందుల పల్కులుగా, ప్రతిధ్వనులుగా, ముద్రలుగా మాత్రమే ఉండక సజీవమైన సుస్వరూపులుగా కావలెను. ఈ నవజీవితమునకు మీరు ఇప్పుడు గర్భస్థ పిండములు, ప్రథమ జములు మాత్రమే అయి వున్నారు. భావి జీవితమునకు ప్రధానముగా కావలసినదంతయు మీయందు కలిగియున్నారు. మీకత్యవసరముగ నుండవలసినదంతయు ఇక్కడ మీయందున్నది.

మీరు దాని ఎరుక కలిగియుండుటకు, జ్ఞాపకము మాత్రము చేయు చున్నాను. ఉద్యానవనములో వృక్షములను పెంచు తోటమాలి వలె, మిమ్ము గమనించుచున్నారు. ప్రకృతి మిమ్ము ఎట్లు పెంచుచున్నదో, తల్లిగారు అదే విధముగా ఇక్కడ మీ జీవనము మిమ్ములను తయారు చేయుచున్నది.

సాధారణముగ, ప్రపంచమునందలి చిన్న పిల్లలందరును ప్రత్యే కాధికారములు గల తెగకు చెందినవారు. పెద్దవారికి, మేధావులగు ఇతర పెద్దలకు లేనిది వారికున్నది. అమాయకమైన పసి ప్రాయమునకు చెందిన రెండు ముఖ్య గుణములను మీకు తెలియచేయుచున్నాను. ఒకటి సంతోషము, చిన్నబిడ్డ ఎల్లప్పుడును సంతోషముతో నుండును. అప్పు డప్పుడు ఏడ్చిన ఏడ్పుగాక; సర్వదా సంతోషముతో చిరునవ్వుగల మోముతో హాయిగా నుండును. నేను ఎల్లప్పుడు స్మితవదనులై యుండు డని తరచుగా వృద్ధులకు చెప్పుచుండును. తల్లిగారు మనకు సర్వకాల సర్వావస్థలయందు నవ్వుచూ ఎట్లు ఉండవలెనో నేర్పినది. ఈ నవ్వుతోకూడిన సంతోషము చిన్నపిల్లల సహజ సంపద. నవ్వు నీ జీవిత పథమును స్నిగ్ధముగా యును. జీవితమునందెదురగు అడ్డంకులను నీవు మరియొక విధానముచే నింత జయప్రదముగా తొలగించలేవు. నీ చైతన్యము నుత్తేజపరచుటకు కూడ నిదియే సాధనము. జీవిత భారము ననాయాసముగా తొలగించగల అద్భుతశక్తి దీనియందు కలదు. నిన్ను తేలికగా ఉన్నత భూమికలలోనికి గొనిపోవును. నవ్వు దైవీ సంపదకు చెందిన గుణము.

చిన్న పిల్లల చైతన్యముయొక్క సహజ సంపత్తిలో సంతోషము తరువాత స్వేచ్ఛ రెండవది. దీనికి ఎక్కడ, ఎట్టి హద్దులుగాని ఆటంక ములుగాని లేవు. అది ఏ పనైన చేయగలదు.

చిన్నబిడ్డల ఈ రెండు సద్గుణములుకూడ పసిపిల్లల స్వభావసిద్ధమైన మరియొక్క గుణమునుండి ఉద్భవించినవి. ఆ గుణము అమాయకత్వము. అనగా ముందువెనకల నాలోచించక తనంతటతాను పొంగి ప్రవర్తించుట. దానికి మనస్సుయొక్క క్లిష్టత, సంకోచములుండవు. యువకుల ప్రకృతికి సహజ గుణములు ప్రభావితములగుటకు, ఇతర ప్రదేశములలో దొరకని సదుపాయములును, సావకాశములును మనకు ఈ ం|్రమములో కలవు. మన వి త వాతావరణములోని స్వేచ్ఛ, మరెచ్చటను కానరాదు. ( ) తల్లిగారే ఈ విషయము మనకొకప్పుడు చెప్పియున్నారు.

"నీవు పెరిగి పెద్దవాడవయిన కొలది, ఈ ప్రథాన గుణములను నీతోపాటు పెంచుకొనవలెను. అప్పుడు నీవు సర్వదా యువకుడుగా-యుందువు".

ఇప్పుడు "నీతోపాటు పెంచుకొనుట" అనునదియే సమస్య. ఈ సమస్యను తల్లిగారు మనకు యిక్కడ పరిష్కరించియే యున్నారు. నేను మీకింతవరకు చెప్పినదదియే. అనగా ఇక్కడ ఉన్నవారు అనుభవించుటకు నొసగబడిన ప్రత్యేకాధికారమదియే. యువస్వభావమునకుచెందిన ప్రథాన సద్గుణములే గాక వానికి తోడు అదనముగా మనమొక వరప్రదానము యబడినాము. అది చైతన్యదానము. అదియు ( ) తల్లిగారి స్వ యమైన చైతన్యము. ఈ అదనపు వర ప్రభావమువలన ఈ వాతావరణమున ఒక ప్రత్యేక మలుపు, ప్ర ్యక స్వభావము కల్గించబడినది. సాధారణ యువ ప్రకృతికి సహజమైనసద్గుణముల ప్రతిభయందును, దాని రకమునందును మార్పు కొనిరాబడెను. నేను మీ ఆత్మ చైతవ్యమునుగురించి చెప్పచున్నాను. ఆ చైతన్యము తల్లిగారి శరీర చైతన్యము మీకు ప్రసాదించిన

వరము. దానిని మీరు మీ మనస్సుతోగాని బుద్ధితోగాని గ్రహించలేక పోవచ్చు. కాని; అది మీలోవున్నదనే నేను చెప్పుచున్నాను. మీ బాహ్య జీవితమునందేమి సంభవించినను, మీరు దానిని పోగొట్టుకోలేరు. అది మిమ్ము తుదకు పరబ్రహ్మపదమునకును, ఈ భువిపై దివ్యజీవితమునకును కొనిపోవును. ఈ విషయము మీ బాహ్య మనస్సునకు అడ్డుతెరవలన అగోచరమై యుండవచ్చును. కాని; అది సర్వదా మీ వెనుక నిల్చి యుండును.

చివరకు నేను మొదట చెప్పినట్లు గోడలమీద చిత్రింపబడిన వ్రాతలు, మీ వ్యక్తిత్వమునందు, మీ చైతన్యమునందు, మీ జీవితము నందు, మీ దేహమునందును సజీవసత్త్వములుగా ప్రకటితములుకావలెను. ఇదియే మీరు యవలసిన ముఖ్యమైన పని, నిజమునకు ప్రధానమైనపని.

ఈ రోజున నవచైతన్యము అంతట వ్యాపించియున్నది. భౌతిక వాతావరణమంతయు ఈ నూతన ఆత్మ చైతన్యముతో నిండియున్నది. శ్రీ తల్లిగారు మనకు ఇక్కడ ఆమె చైతన్యమును మూర్తివంతముగా ని పించినది. ఆమె దానితోపాటు సజీవమైన తన వ్యక్తిత్వమునే మనయందు ఆధ్యాత్మిక వారసత్వముగా ఉంచినది. మనము దానినిగురించి గర్వించక, దానికి మనము అర్హులమని నిరూపించుటకు ప్రయత్నించవలెను. దివ్య వ్యక్తిత్త్వము ప్రతిచోటను పెరుగుచునే యుండును. కాని; దాని మార్గ దర్శకులు, అగ్రగాములును మీలోనే కలరు.

సహజముగా, నూతన సృష్టి, అన్ని దేశములయందును, ఎల్ల కాలములయందును జరుగుచునే యుండును. కాని: వాటి రూపములు, విధానములు మీరు నిర్ణయించవలసియున్నది. ఎందుకనగా ( ) తల్లిగారు ఆమె భౌతిక శరీరముతో ఇక్కడుండిరి.

మీరు ప్రకటించిన మంత్రాత్మకములైన దివ్యవాక్కులను సజీవ మైన దివ్యశక్తులుగా, మీలో అవతరించిన దేవతలుగా చేయవలెను. దానికి జములు ఇక్కడున్నవి. శ్రీ తల్లిగారు, తమ సృష్టికి పునాదులు ఇక్కడ వేసిరి. ఇక్కడ వేళ్ళూని, శాఖలువేసి, సర్వత్రా వ్యాపించ వలెను. ఏమైనా, తల్లిగారు చెప్పినట్లు ఇక్కడగాని మరెక్కడగాని జరుగవలెను.

"స్వర్ణగోపురము నిర్మించబడినది
తేజశ్శిశువు జన్మించినది"

("సావిత్రి" 11వ పుస్తకము 1వ సర్గ)



## ఆత్మ స్వాతంత్ర్యము

భౌతిక తనకు, పై భూమికల ఒత్తిడి వెనుదిరిగి పోయినందున, సామాన్య స్థితి చేకూరినది.

ఒత్తిడి అంటే వేరుపడుట. ఏదో విజాతీయ వస్తువు ఎక్కడ నుండియో పని యుట, జోక్యము కల్గించుకొనుట. ఒక ప్రక్రియకు ఒక తీరు, తెన్ను ఒక ప్రయోజనము నుద్దేశించిగాని లేదా కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లోగాని కొంతకాలము అవసరమేగాక ఆదరణీయముకూడ. కాని పరిస్థితులు మారినవి.

ఉన్నత చైతన్యము ఎల్లప్పుడును ఊర్ధ్వ భూమికలలో, నిలిచి పోక, అధో భూమికలలోనికికూడా దిగివచ్చి వాటితో మామూలుగా నుండును. ఊర్ధ్వ భూమికలలోని చైతన్యము అధో భూమికలలోనికి

అవతరించి వాటితో కలిసియుండుటగాని లేదా అధో భూమికలలోని చైతన్యము ఊర్ధ్వ భూమికలలోనికధిరోహించి కలిసియుండుటగాని, లేదా రెండును మధ్యేమార్గమున కలసిగాని యుండవలెను.

భౌతిక ప్రకృతి లేదా పదార్థ స్వభావము దానికి తెలియని విషయములను గాని పరాయివస్తువులను గాని అంత లికగా సహింపవు. అది తనకు మేలు చేయునది అయినను, విజాతీయమైన వస్తుస్పర్శకు బిడియముతో భయముతో ముడుచుకొని, వెనుదిరిగిపోవును. ఆ స్పర్శ దానికి బాధాకరముగా కూడ ఉండును. తుదకు ఆ భౌతిక పదార్థము ప్రోత్సహింపబడుటకు, ప్రతికూలించుచు వెంట కొనిపోవుటకు కూడ అనువుగా నుండదు. అది దాని యిష్టానుసారము ప్రవర్తించవలసినదే. అది తాను సంపాదించి, దాచుకొని తనలో గర్భితము చేసికొనిన దానిపైననే ఆధారపడి, దానినే ఆవిర్భవింపచేయు చుండును. భౌతిక పదార్థము తన తొలి స్థితిని, విషయగ్రహణమునకు సంబంధించిన అభ్యస్తస్థితిని దాటవలెను. ఆ సమయమున ప్రబోధముగాని లేదా బలవంతపుటొత్తిడిగాని అవసరముగాని, అనివార్యముగాని కావచ్చును. కాని ఈ స్థాయికూడ దాటిపోయిన మీదట సాధారణ భౌతిక జీవితమునందు ఉన్నతమైన అనుభూతుల ప్రభావము సహజమై ప్రకటితమగును. భౌతిక పదార్థముయొక్క సహజ స్థితి, ఊర్ధ్వ చైతన్యస్థితిగా మారును. దాని జీవితము తన నైసర్గిక ప్రకృతి నడిపింపబడి తనకు స్వభావసిద్ధమైన సత్యమును ప్రకటించును.

భూలోకమునకు దైవ సంప్రాప్తి విధికృతమై యున్న యెడల అది దానియొక్క స్వచ్ఛందమైన కోరికవలననే కావలెనే గాని పరతంత్రమువలనగాని, బయటి ఒత్తిడివలనగాని కలుగకూడదు. తనకు

తానుగా ఎన్నుకొనిన విధివిధానముతో, సంతోషముతో, అప్రయత్నముగా ఆంతరంగిక ప్రోత్సాహముతోనైనా జరుగవలెను.

మూల అజ్ఞానము తానెంత స్వతంత్ర వాంఛతో జన్మించినదో మరల అది ఎరుకవైపు మరలుట కూడ అంత స్వ య ప్రేరణముతోను స్వేచ్ఛతోను జరుగవలెను. భగవంతుడు ఏ మానవుని వరించునో ఆ మానవుడే భగవంతుని వరించునను విషయము ఒక నిగూఢమైన సత్యమే కావచ్చును. కాని అది వేరు విషయము. ఈ భువిపై మానవులు స్వతంత్రముగల వ్యక్తులు. మనము ఆ స్థితిని కోరుకొనవచ్చును, కోరుకొనక పోవచ్చును.

ఎటు చూచిన, ఎవరైనను, దేనినైనను సంపాదించవలెనన్న, అది వారి స్వతంత్రమైన స్వశక్తిపై ఆధారపడవలెను. ఎంత విలువైనదైనను, పరాయివారి- అయాచితముగా యివ్వబడినను, బలవంతముగా అంటగట్టబడినను, దానియందొక అసహజమైన విజాతీయత, పరుషత, గోచరించుచుండును. ఏ వస్తువునైనను తనదిగా సికొనుటకు, తనలో భాగముగా ఇముడ్చుకొనుటకు దానిని పూర్ణముగా ప్రేమించుట నేర్చుకొనవలెను. యథార్థమైన ప్రేమ స్వేచ్ఛయందే మనగలదు.

అతీత మానసముయొక్క అవతరణ విషయము వచ్చినప్పుడెల్ల ఇటీవలి కాలములో తల్లిగారు, అతీత మానసము అవతరించుట అనునది ఇక లేదు. ఎందుకనగా ఆ పని జరిగిపోయినది. అది ఇక్కడ వున్నది. ఎక్కడనో పైనుండి దిగివచ్చు ప్రశ్నయు లేదు. ఇప్పుడిక మనతో, మనమధ్యనేయున్న అతీత మానసమును బహిర్గతము యుటన్నదే ప్రశ్న.

ఒకానొక సమయములో తల్లిగారు భౌతిక ప్రకృతిని సహకరించ వలసినదిగా ప్రాధేయపడి కోరినది. సూత్రప్రాయముగా అంగీకరించినను, క్రియారూపమున దాని సహకారము లోపభూయిష్ఠముగా నుండెను. ఇప్పుడు పరిస్థితులు తారుమారయినవి. భౌతిక ప్రకృతియే భగవంతుని సహకారము కోరి ప్రాధేయపడవలసి వచ్చినది. ఈ పరిణామ కార్యక్రమములో, భౌతిక పదార్థ · తన ముందుకువచ్చి ప్రధానపాత్ర వహించి నడిపించవలసియున్నది. ఆమె భౌతిక శరీర సహకారము మరలి పోయినది. మనము చేయవలసిన క్రియాకలాపములలో మనము సంపూర్ణమైన స్వేచ్ఛతో శ్రమించుట నేర్చుకొని శ్రమించవలెను. అందులకే మన భౌతిక చర్యలయందు మన సేవాధర్మముల నెరవేర్పు టకుగాను పూర్ణ స్వాతంత్ర్య మీయబడెను. ఆమె, తన భౌతిక శరీరము నుండి వైదొలగిపోయినదని మనము చెప్పుచున్నాము. కాని ఆమె ఇక్కడనే వున్నది. ఆమె శక్తిరూపములో మూర్తివంతమై ఇక్కడనే ఉన్నది. ఆమె మనకు అందుబాటులో ఉండి, ఆమె ఉనికియే మనకు కావలసినంత సహాయకారి అయి ఉన్నది.

ఇప్పుడు, ప్రస్తుత విషయము పదార్థ తన ఆమె దివ్య సాక్షాత్కారమును ఎంతవరకు గ్రహించి జీర్ణము సికొనినది అని. మానవుడు సాధించగల సిద్ధికిదియే కొలతబద్ద. భౌతిక వరాశి పరతత్త్వము నెంతవరకు గ్రహించి ప్రకటించగలదో అంతమేరకు మనము సత్స్వరూపులము, దివ్యాత్ములము కాగలము. మనము ఎట్టి మార్పును లేక గత సిద్ధివద్దనే నిలిచిపోయినచో బహుశః మనము కొన్ని కోట్ల సంవత్సరములు నిలచిపోవలసి వచ్చును.

మనకు ఈ మార్పు అనేకమారులు సాధారణముగా ధరించు దుస్తుల మార్పుగా తోచవచ్చును. ఇంకొక మార్గాంతరమేమియు నున్న

టుల కనుపించదు. కాని దుస్తుల మార్పుకూడ అనివార్యమే, ఆశించ వలసినదే. కాని వాటినే చాలా కాలము ఉంచుకొనిన కంపెత్తును. 'వైతరణి' యందు లేదా (మనము గ్రీసు వాస్తవ్యులమై యున్న యెడల) 'ఎచ్చిరాన్' యందు ఒక మునుగు మునిగిన బాగుండవచ్చును. ఎల్లప్పుడును ఏదియో ఒక అద్భుతము సంభవించవచ్చును; తల్లిగారు తరుచు ఈ విషయమునే ప్రస్తావించుచుందురు. ఆ సందర్భములలో వేదములలో చెప్పబడిన గోవులవలె ఆంతరంగికముగా పరివర్తనము చెందుట నేర్చుకొనవచ్చును. ఋగ్వేదములోని ఋషి పలికినట్లు "పలిక్నిరిద్ యువతయో భవన్తి"— తల నెరిసినవారు (ముసలివారు) కూడ యువకులు కావచ్చును. (ఋ. వే. V. 2. 4)

ఆ దివ్య తత్త్వమునకు, పరా చైతన్యమునకు, సహజముగా బాధ యత్కించిత్తయును లేదు. అనంతమైన కాలము దానికి క్రీడా రంగము. ఒక కోటి సంవత్సరములు ఇటుగాని అటుగాని అయిన యెడల దానికి లెక్కలేదు.

కాని మనము మానవులమై యున్నాము. మనకు తత్తుల్యమైన దివ్య భూమికలు వుండవచ్చును.

అందు నిమిత్తమై అనగా ఆ కోటి సంవత్సర పరిమాణముగల కాలమును కుదించుటకై తల్లిగారు మనతో సమానమైన పూర్తి మానవ స్వరూపమును దాల్చినది.

ఈ పరిస్థితులలో అవసరమైన పని—బహుశః అంతకు మించియే తల్లిగారు కొనసాగించుచునే యున్నారు. ఆమె తన పనిని విరమించ లేదు. కాని అతి ప్రధానమైన విషయము, బహు క్లిష్టమైన విషయము—

అనగా ప్రమాదమునుండి బయటపడుట – పూర్తి చేయబడినది. శ్రీ అరవిందులు మరువరాని మాటలలో తన 'మాత' అను గ్రంథములో ఈ క్రింది విధముగా నుడివియున్నారు.

"శ్రీమాత, అందరిని, పైనుండి పరిపాలించుటయేగాక, ఈ క్రింద త్రిగుణాత్మకమైన ప్రపంచములోనికి కూడ అవతరించును. ఈ సృష్టియందలి అన్ని విషయములును, అజ్ఞాన భూయిష్ఠమైన సర్వ చర్యలును అవ్యక్తముగా ఆమెయే, ముసుగువేసుకొనిన శక్తిగా చేయు కర్మలై యున్నవి. ఈ ప్రకృతియొక్క స్వరూప శక్తులు, కుదించుకొనిన ఆమె తత్త్వముయొక్క సృష్టి. అనంతునియందలి సంభవములలో ఒకానొక సంభవమును ఆ పరాత్పరుని అద్భుత ప్రభావము చలింపబడి రూపొందింపబడుటకు గాను, అవి సృష్టింపబడినవి. ఈ యజ్ఞమునకు ఆమె అంగీకరించి, ఈ అజ్ఞాన భూయిష్ఠమైన జీవాత్మ ముసుగు వేషములను ధరించినది. కాని ఆమె స్వయముగా ఈ తమస్సులోనికి అవతరించినది. దీనిని వెలుగులోనికి గొనిపోవుటకే. అట్లే ఈ అసత్తులోనికి దిగినది, దీనిని సత్తుగా మార్చుటకే. ఈ మరణములోనికి వచ్చినది, దీనిని దైవీ జీవితముగా త్రిప్పుట . ఈ బాధాయుత ప్రపంచమునందలి దుర్భర దుఃఖసాగరములోనికి ప్రవేశించినది, దీనిని అంతరింపసి పరమానంద తత్త్వముతో నింపుటకే. ఆమెకు ఆమె బిడ్డలపైగల గాఢ ప్రేమ తనే ఆమె అజ్ఞానము, అసత్యము అను ఈ అంధకార శక్తులయొక్క తాకిడులను, దహనకాండలను ఎదుర్కొనుటకుగాను, ఈ విధముగ మరుగుపడియుండుటకు అంగీకరించినది. ఈ చావు–పుట్టుకలనబడు ద్వారముల గుండా పోవుటకును, సృష్టియందలి దుఃఖములు, కష్టములు అను బాధలను తనపై వేసుకొనుటకును, అంగీకరించినది. ఎందువలన అనగా

ఈ విధముగా తప్ప, ఆ పరమోత్కృష్టమైన ఆనందము, సత్యము, తేజస్సులతో నిండిన శాశ్వత జీవితమును సాధించుటకు మరియొక మార్గమేదియును లేదు. ఇదియే మహోన్నతమైన యజ్ఞము. దీని, పురుష యజ్ఞమనుచుందురు. నిజమునకు ఇది ప్రకృతియొక్క సంపూర్ణ హోమము దివ్యమాత యజ్ఞము.

---

## ఆశ్రమము - లోపల, బయట

నేడు మీకొక కథ చెప్పెదను. అది మరొక రకమైన కథ. ఒక కలను గురించి చెప్పెదను. దానిని కొంతకాలము క్రిందట కంటిని; అది ఒక దృశ్యము. అది ఒక ఆశ్రమము. ఆశ్రమమేగాని మన ఆశ్రమము వంటిది కాదు. కలనదానికి, దీనికి రెంటికిని ఎక్కువ సాదృశ్యము కలదు. కొన్ని విషయములందు పోలికలు కలవు. మిగిలిన విషయములలో భిన్నత్వమే. ఆ ఆశ్రమమంతయు ఒకేచోట ంద్రీకృతమై చక్కని వ్యవస్థతో నున్నది. అందు ఇళ్ళు చెదురుమదురుగా లేవు. అక్కడ ఇతరులకుగాని ఇతర సంస్థలకుగాని సంబంధించిన కట్టడములుగాని, గృహములుగాని లేవు. అక్కడి నిర్మాణ పథకము మనోహరమై, గృహములన్నియు చూచుటకు అందముగ నుండెను. మనకు ఎన్నిరకములైన కరాగారములు కలవో అక్కడను అన్నియు కలవు. అక్కడ ఒక పాఠశాల, క్రీడారంగము, గ్రంథాలయము కలవు. కాని అవి అన్నియు క్రమబద్ధమై వ్యవస్థీకృతమై నుండెను. తల్లిగారు కూడ అక్కడ వున్నారు. ఆమె ఒకచోటు నుండి మరియొక చోటికి పోవుచు, అన్నిటిని పరిలించుచు, అందరితోను మాట్లాడుచున్నది. ఆశ్చర్యమేమన ఆ

జనములో కొందరు ఇప్పుడు ఇక్కడ ఉన్నవారిలో కొందరుగా నాకు కనబడిరి. వారిలో చాలమంది ఇతర దేశములనుండి వచ్చిన పరాయి వారై యుండిరి. ఇక్కడ ఉన్నవారివలె గోచరించిన, అక్కడివారిని గురించిన భావములు అస్పష్టముగా నున్నవి. వారి పేర్లు చెప్పలేను. కాని కొందరు ఇక్కడవుండి గతించిన వారుకూడ ఉండిరి. వారిలో కొందరిని బాగుగా గుర్తించగలిగితిని. వారి రూపురేఖలు, ముఖములు అచ్చముగా వెనుకటివలెనే కనుపించినవి. కాని ఒక నూతనమైన వికాస ముతో నిండి యౌవనములో నుండిరి. వారు క్రియాశీలురై సుందర మూర్తులైన యువకులు, యువతులై యుండిరి. శ్రీ అరవిందులు ఋగ్వేదము నుండి ఉటంకించిన ఒక విషయము నాకు స్ఫురణకు వచ్చుచున్నది. ఆ వేదర్షి, పచ్చిక బయళ్ళలో మేయుచు సుఖ సంపన్న మైన గో సమూహములను గురించి నుడువును. వాటిలో ముసలి గోవులును యిపుడు యౌవనమును పొందినవి. ఆ ఋషికి గోవు అనగా వెలుగు, సూర్యకిరణము అంటే శుద్ధమైన చైతన్యము. ఈ భావము వారికి, వారికాలపు జీవిత పరిసరములనుండియు, ఆ కాలములో వారి జీవితములో ప్రధానభాగమైన గోరక్షణ, ఆలకాపరితనమునుండియు ఉత్పన్నమై యుండవచ్చును. గో సమూహము యావత్తు స్వచ్ఛమైన తెలుపులో విరాజిల్లుచెంత సుందరమైన భావన! ఎంత చక్కని చిత్ర పటము! అటులే ఆ ఆశ్రమవాతావరణములోకూడ ఒక విశిష్టత నెలకొ యుండెను. అది తేటతెల్లమై పరిశుద్ధమై, ఆహ్లాదకరమైన వాతావ మున అక్కడ నిలిచినపుడు, నీవు సాధారణముగ సాంసారిక ప్రప నందు లోనగు కోపతాపములుగాని, అసూయాద్వేషములుగాని, పరత గానీ, వికార స్వభావములుగాని, తదితర అల్పభావములు స్వేచ్ఛా పూర్ణమైన ఉదార భావములతో నిండియుందురు.

మనుష్యులయందును విషయములయందును సంతోషదాయకమైన సహ కార భావము తొణికిసలాడు చుండెను.

నేను చూచిన ఆ ఆశ్రమము ఇక్కడి ఈ ఆశ్రమముయొక్క అంతరంగిక స్థితియేయని నాయూహ. మనందరి హృదయాంతరాళముల లోను ఉన్న ఆశ్రమము. మనము ఇక్కడ ఇప్పుడు చూచునది దాని బాహ్య స్వరూపము. అనేక వికారములకు లోనై, అనేక విధములైన అసత్య భావముల ఒత్తిడి రూపుచెడిన దాని భౌతిక రూపమును చూచు చున్నాము. ఆ ఆంతరంగిక ఆశ్రమమునకు సంబంధించిన ఒక బాహ్య ప్రాపంచిక వాతావరణము కలదు. అది ఉన్నతమైన శిఖరములు కలిగి యున్నది. నేనిదివరలో అనేక పర్యాయములు, ఇక్కడ ఉండువారు, ఈ వాతావరణ వాయువులను పీల్చువారు, చాల అదృష్టవంతులని చెప్పి యున్నాను. వారు ఎంతటి తప్పిదమును సినను, ఎంతటి లోటు పాటులను కలిగినను, వారు ఏమి సినను వారు సర్వదా ఒకానొక ఆంతరంగిక సౌందర్యము, సువాసనల సంస్పర్శతో ఏకమై యున్నారు. తల్లిగారు వెనుక అనేక మారులు నుడివిన మాటలు మీరు విన్నారో లేదో నాకు తెలియదు, ఇక్కడి పిల్లలందరు, ఇక్కడ కొంతకాలమున్న పిమ్మట తమలో ఒక నూతన ఆవరణను నిర్మించుకొందురు. ఆమె ఆవ్యక్తిని దూరము నుండియే— చాల దూరమునుండి ముఖమునుగాని శారీరిక రూపములనుగాని గమనించకయే, వాని నావరించియుండు వాతావరణమును బట్టి ఆ వ్యక్తి ఫలానా అని గుర్తుపట్టగలుగుచుండెడిది. బయటివారుండు వాతావరణము కంటె, ఆశ్రమవాసులనంటియున్న వాతావరణము విశిష్టమైనది. ఈ వాతావరణము ఒక వెలుగుతోకూడిన వాతావరణము (Aura). అది శుద్ధ తత్త్వము, సంతోషముతో కూడిన శోభ. ఆశ్రమములోని పిల్లలంద

రను తల్లిగారి ఈ వాతావరణము ఆవరించియున్నది. అందువల్ల ఆరోజులలో ఆమె శలవు దినములలోకూడ పిల్లలు బయటి ప్రపంచములోనికి పోరాదనుచుండెడిది. దానికి కారణము— బయటి ప్రపంచములోనికి వెళ్ళి తిరిగివచ్చిన పిల్లలకు ఆశ్రమ వాతావరణము పోవుటయేగాక బయటి ప్రపంచములోని పంకిలము పూయబడి వచ్చెడివారు. అప్పుడు ఆమె వారిని శుభ్రపరచుటకు, యథాస్థితికి తెచ్చుటకు చాలకాలము శ్రమపడ వలసి వచ్చెడిది.

ఈ సందర్భములో, పాప పరిహారార్థము పాపులు గంగాస్నానము చేయుటను గురించిన శ్రీ రామకృష్ణ పరమహంస చెప్పిన ఒక కథ, మీకు జ్ఞాపకముండవచ్చును. వారు తమ పాపములను గట్టున పెట్టి, కాదు, వారు గంగలోనికి దిగునపుడు వారి పాపములే వారి నుండి పై దొలగి గట్టుపై కాచుకొని, వారు పరిశుద్ధులై వచ్చిన వెంటనే వారిపై బడి వారినావహించి, వారినెప్పటి పాపులుగానే ఉంచును. నిజమునకు ఇక్కడ మీరెల్లప్పుడు పాపులుగనే యుండుట విధికృతము కాదు.

అయినను ఆ వాతావరణము, ఆ ఆంతరంగిక వాతావరణము ఇక్కడ ఉండియే యున్నది. తల్లిగారు భౌతిక శరీరమును విడచిన కారణముగా ఆ వాతావరణముకూడ ఏ కొంచెమో, అతి స్వల్పముగా తగ్గియుండవచ్చును. కాని ఇంకను ఉండిన మాట వాస్తవము. ఎందువలన ననగా తల్లిగారు వెనుకటి వలెనే బాహ్య భౌతిక రూపములో కాకపోయి నను, అనుభవ వేద్యమైన ప్రత్యక్ష స్వరూపములో ఉండి యున్నది. ఆ ఆంతరంగిక ఆశ్రమములో నేను చెప్పిన విధముగా ఇక్కడ మరణించిన వారు కొందరును కొందరు క్రొత్తవారునుకలరు. వీరందరును పూర్తిగా అక్కడనేయున్నారు. కాని ఇక్కడున్న మనము; ఒక కాలు ఇక్కడ ఒక

కాలు అక్కడ పెట్టి 'గోడమీది పిల్లివాటము' తో ఇందును, అందును పొందక రెండు వేర్వేరు జీవితములు గడుపుచున్నామా! యనునట్లు జీవించుచున్నాము. మీలో ఉన్నతమైన భావములు రేకెత్తినపుడు మీరు మంచి మనోహరమైన ప్రేరణలు కలిగినప్పుడు, మీరెవ్విధమైన సంబంధములు లేక స్వతంత్ర వాయువును పీల్చుచూ, సుఖ సంతోషములను కలిగినపుడు మీయందు ఉదారత్వము నిండి మూర్తీభవించినపుడు, మీరా యాంతరంగికాశ్రమముతో సంబంధము కలిగి యుందురు. ఆ వాతావరణ వాయువులను పీల్చుచుందురు. మీలో చాలమంది, కలలోగాని, నిద్రలో గాని, నిద్రవలె తోచు ఒకానొక సమాధిలోగాని తల్లిగారిని చూచియే యుందురు. ( ) అరవిందుల దర్శనభాగ్యము కూడ కలిగియే యుండును. అది ఎందువలన అనగా, మీకు ఆ ఆంతరంగిక వాతావరణముతో సంబంధమేర్పడి, దానిలో ప్రవేశించినందున. ఇప్పుడు మనము చేయవలసిన పని, మనము జాగ్రదావస్థలోను ఆ సంబంధము ఇతోధికముగా కలిగి, ఆ ఆంతరంగిక చైతన్యము, అంటే తల్లిగారి సాక్షాత్కారము కలిగి యుండవలెను. మీలో సగము మంది యొక్క అంతర్జీవితము, అక్కడనే అందలి ఆనందమయమును తేజోమయమును ఐన వాయువును గ్రోలుచునే యున్నది. మీరు దాని 'ఎరుక' కలిగి యుండవలెను. ఏ కొంచెము ఆ జ్ఞానము కలిగినను, ఆ ఆంతరంగిక ఆశ్రమ సంపర్కము కలిగినను మీరు మిక్కిలి ఉత్సాహవంతులై విజ్ఞానమయ సౌందర్యములో నోలలాడుదురు. ఇప్పుడు మీరు సాగించుచున్న యీ బాహ్యాశ్రమ వితమును ఆ ఆంతరంగిక జీవితములోనికి త్రిప్పినయెడల మీరు క్రమముగా, యీ ప్రస్తుత జీవితమును ఆ అంతర్జీవితపు మూసలోనికి మార్చగలరు. ముఖ్యముగా విద్యార్థులయిన బాలబాలికలయొక్క కర్తవ్యము,

ప్రధాన కర్తవ్యమిదియే. అధ్యయనము, విద్యాభ్యాసము తరువాత వచ్చు రెండవ పని. మీరు యవలసినది, -యగలిగినది, యీ నూతన వాయువులను పీల్చి ఎక్కువ మనోహరమైన, ఉత్కృష్ట జీవితమును జీవించుటయే. మీకు ఈ అంతర్జీవితము తేలికగా కలుగును. అది ఇక్కడ ఉండనే ఉన్నది. సమిష్టి అంతర్జీవితము. అది తల్లిగారి ప్రత్యక్ష సాన్నిధ్యమను పరిమళముతో నిండి, అతి మనోహరమై యున్నది. ఆ సమిష్టి జీవితములో మీరందరూ అన్నలు, చెల్లెండ్రుగానే గాక, ఆత్మయందు శారీరికముగకూడ, తల్లిగారి ప్రేమమయ జీవిత తత్త్వము నందైక్యతను కలిగియున్నారు. ఆ ఆంతరంగిక యైక్య వితమును మీరు బాహ్యముగా ప్రకటించి, మీ బాహ్య కర్మలను ప్రభావితము -యవలెను. ఆ అంతర్జీవిత స్వభావము, బహిర్గతమై, బాహ్య-వితములో అప్రయత్నముగా మార్పులు కొనివచ్చి, తన ప్రభావమును ప్రకటించుటయే అయి ఉన్నది. ఈ విషయము మీకు తెలియకపోయినను, దాని ఆవిర్భావము, నెమ్మదిగా ముందుకు సాగుచునే యున్నది. కాని మీరు ఎరుకతో, సహకరించి సహాయపడినచో, మీరు విశాలమైన విజ్ఞానవంతులై, ఒక నూతన వ్యక్తిత్వమును పొందగలరు. మీరు పరమోత్కృష్టమైన ఆనందానుభూతిని పొంది అద్భుతమైన లబ్ధిని సాధించగలుగుదురు.

ప్రస్తుతము, నేను చెప్పినట్లుగా ఈ రెండు ఆశ్రమములును (లోపలి బయటి ఆశ్రమములను) అనగా, రెండు ప్రపంచములును, రెండు జీవితములును, వేరై యున్నవి. అవి సమాంతర రేఖలపై నడుచున్నట్లు తోచుచున్నది లేదా అప్పుడప్పుడు, ఒక దానిలో ఒకటి చొచ్చుకొనిపోయి, మిళితమైనను, బిగింపుచెడి అంతర్గ్రథితమై యున్నవి. అవి ఒ ఉనికిని గలవి కావలెను. అంతర్జీవితము, బాహ్య

జీవితమును లోగొని ర్ణించుకొనవలెను. బాహ్య జీవితము, పరిశుద్ధము చేయబడి, మలినములు కడిగివేయబడి, అంతర్జీవితమునకు కైవశము కావలెను. అవి రెండును, ఐక్యమై ఒ వ్యక్తిగా, ఒకే జీవితముగా, ఒకే శరీరముగా ఏకత్వమును సాధించవలెను.

మీపని, ప్రయత్నపూర్వకముగా విజ్ఞానవంతమై, ఇతోధికముగా అంతర్జీవితమునందు పాల్గొనవలెనని చెప్పియున్నాను గదా! సహజముగా, ఆ పని ఎట్లు చేయవలెనని మీరు ప్రశ్నింతురు. దానికి ఇదమిత్థమని, ఖచ్చితమైన ఉపాయము లేదు. దానిని నేర్చుకొనుటకుగాని సంపాదించు టకుగాని, ప్రసిద్ధమైన నియమావళిలేదు. అది గణితశాస్త్రమునందలి సమస్యా పరిష్కారమును నేర్చుకొనినట్లుగాని, వ్యాయామమును నేర్చు కొనునట్లుగాని, పదేపదే అలవాటు - సికొని సాధించగల విషయముగాని కాదు. అది యాంత్రిక విధానము సిద్ధించునది కాదు. అది సహజముగ పెరుగునదై యున్నది. అది ఆకస్మికముగా అనుకోకుండా నీకు గోచరమై నీలోనికి వచ్చును. నీవు దానికొరకై మనః పూర్వకముగా ఆకాంక్షించ వలెను. అతి తీవ్రముగా ఆకాంక్షించుచునుండవలెను. మంత్రమువలె "నేనక్కడుండవలెను". "నేనక్కడుండవలెను". "నేనక్కడుండ వలెను". అని ఉచ్చరించు చుండవలెను. అది - సిన చాలు. అది నీయం దొక నూతన జ్యోతిని వెలిగించును. నిన్ను ముందుకు గొనిపోవుట కొక క్రొత్త ఉత్సాహమునిచ్చును. ఇదియే పసిబిడ్డ, తల్లిని గురించి పలుకు పిలుపు. సర్వదా తల్లిగారు ఆ పిలుపునందుకొని జస్సు, శక్తి, ప్రేమ రూపమున జవాబిచ్చును.

తల్లిగారు భౌతిక శరీరముతో - కపోయినను, ఆమె చైతన్య స్వరూపముతో మనమధ్య నిలిచియున్నదని మీరిదివర వినియున్నారు.

నేను కూడా చెప్పియున్నాను. ఆ చైతన్యము సజీవమైయుండి పని యు చునే యున్నది. ఆమె తన భౌతిక కాయమును త్యజింపక పూర్వము, తాను శరీర త్యాగము చేసినను, తన చైతన్యము సంతతము మనమధ్య ఉండగలదని, వ్రాయుచ్చినది. కాని నేను దానికి కొంత కలుపదలచితిని. ఆమె మన మధ్య నిక్షిప్తము సినది, ఆమె చైతన్యమును మాత్రమే కాదు, ఆమె ప్రేమను పరిపూర్ణమైన అఖండమైన ప్రేమను ఆమె బిడ్డల మగు మన మధ్య వదలినది. - ను మీకు అంతరంగిక ఆశ్రమ జీవిత మును గురించి వక్కాణించి యుంటిని. ఆ అంతర్జీవితము ఆమెకు బిడ్డల యందున్న ప్రేమపై నిర్మింపబడినది. కనుక, మీకు తల్లిగారియందు గల ప్రేమ ద్వారా, ఆ అంతర్జీవితము లోనికి ప్రవేశించి, అనుభవించగలరు. అదియే తల్లిగారికి మీ యందుగల ప్రేమకు, మీరు బదులుగా చూపెడి ప్రేమ. ఆ ప్రేమజ్యోతిలో, మీరు ఆమె ఆశించిన ప్రకారము క్రమముగా వికసించగలరు. 18-10-74, 22-10-74



## భూమి తిరిగి రాక

( తల్లిగారు తన "ప్రార్థనలు—ధ్యానములు" అను పొత్తములో చి 25-9-1914 వ దినమున ఈ క్రింది విధముగా వ్రాసిరి.

"ఒక నూతన వెలుగు భూమిపై రానున్నది. ఒక నూతన ప్రపం చము జన్మించనున్నది మరియు వాగ్దానములు సిద్ధించగలవు."

కొంత కాలమునకు అనగా నలుబది సంవత్సరములకు చి. 29-2-1956వ దివసమున పై వాక్యములలోని క్రియాపదములోని కాల విషయమైన మార్పును ర్చి ఈ క్రింది విధముగా తిరిగి వ్రాసిరి.

"ఒక నూతన వెలుగు భూమిపైకి వచ్చినది.
ఒక నూతన ప్రపంచము జన్మించినది.
వాగ్దానములు పూర్తి యబడినవి".

పరిస్థితులు మారినందున మార్పు అవసరమైనది. ఆ స్థితి యందలి యథార్థ విషయములు సమూలముగా మారినవి. తల్లిగారే తరువాత ఒక నెలరోజులకు అనగా ది. 24-4-1956 వ దివసమున ఈ క్రింది ఆదేశమును అందించినారు.

"అతీత మానసము భువిపై ఆవిర్భవించుట వాగ్దాన పరిధిని దాటి, సజీవమైన యథార్థ విషయమైనది.

ఇక్కడ అది పని - యుచున్నది. గ్రుడ్డివారు, స తనులుగాని వారు, తుదకు వ్యతిరేక భావముచే యిష్టములేని వారు సహితము దానిని గుర్తించ వలసిన రోజు రాగలదు."

తల్లిగారు తనకు సాక్షాత్కరించిన నూతన ప్రపంచము జన్మించినదని ముమా రు ప్రకటించినది. తన మాటనామె నొక్కి నొక్కి చెప్పినారు. అది మన చాటున ఉన్నది. అది కదలు చున్నది. దానిని కప్పిపుచ్చిన దట్టమైన తమస్సుల చొచ్చుకొని, ముందుకు తీగలు సాగుచున్నది. కాని దాని పంథా అభేద్యము, అ యము, బాహ్యజ్ఞానావరణ భారము దానిని ఎల్లకాలము అదుపులోనుంచ జాలదు.

అభివృద్ధి కొనసాగుచున్నది. తల్లిగారు సుమారు రెండు సంవత్సరముల పిమ్మట ది. 3-2-1958 వ దివసమున ఒక అతి ముఖ్యమైన ప్రకటన, అది సర్వాంగ పూర్ణమైన అతీతమానస నౌక భూలోకము యొక్క రేవు రినదని అతి ముఖ్య ప్రకటన సిరి. మానవులలో

అతీత మానస జీవితమునకు సిద్ధముగా వున్నవారి నందెక్కించుకొని వెళ్ళుటయే దానిపని. ఆ సన్నివేశము, అతివిపులముగా, చాల మనోహర ముగా అతిసుందరముగా తల్లిగారి వర్ణింపబడెను. ఆ ఘట్టమును చదివిన ఒక బాలిక, తల్లిగారిని ఆ నౌకలో తననొక ప్రయాణీకురాలిగా అనుమతించవలసినదని ప్రార్థించినది. తల్లిగారు ఈ నూతన ప్రపంచమును సృష్టించిన ద్రవ్యము అతిమానసము తాలూకు పదార్థమే. అది భౌతిక పదార్థమునకు అతి సమీపములో ఉన్న, అతీత మానసము తాలూకు మొదటి ఆవిర్భావమని వివరించినది.

ఐన, ఇది దాని ముగింపు, తుది పర్యవసానము కాదు. భౌతిక పదార్థమును కూడ అది తాకి దానినికూడ తిరిగి నిర్మాణము చేయవలెను. ఆ పనికి కొంత వ్యవధి కావలెను. చివరకు కొంతకాలము ఆలస్యము జరుగును. సృష్టి విధానము ఈ రీతినే అవలంబించును. అనగా, ఈ భూమిపై ఏదైనను ఆవిర్భవింప బడవలెనన్న, సృష్టింపబడవలెనన్న, అది మొదట సూక్ష్మ ప్రపంచములో సృష్టింప బడవలెను. అట్లు తయారైన పిమ్మట భౌతిక ప్రపంచము కూడ దాని రాకకు అనువుగా మారిన పిమ్మట అది ఈ భౌతిక ప్రపంచములోనికి క్రమముగాను, నెమ్మదిగాను లేదా తొందరగా గాని, చురుకుగాగాని విశ్వేశ్వరుని ఇచ్ఛననుసరించి దిగి వచ్చును. ఈ విషయమును నిరూపించుటకు తల్లిగారే ఒక ఉదాహరణ మును ఇచ్చియున్నారు.

ఒకానొకప్పుడు అనగా 1915వ సంవత్సరములో భారతదేశము బానిసత్వములో ఉన్నపుడు, భారత దేశమునకు స్వాతంత్ర్యము సిద్ధించునా? అని అడుగగా తల్లి నిస్సంకోచముగా "భారతదేశము స్వతంత్ర ముగానే ఉన్నది" అని జవాబు ఇచ్చినది. ఆమె "భారతదేశమునకు

స్వాతంత్ర్యము రాగలదు" అని నుడువలేదు. ఆమె ఒక జరిగిపోయిన విషయముగా "భారతదేశము స్వతంత్రముగానే యున్నది" అని లికగా చెప్పిరి. కాని, ఈ భౌతిక పదార్థ సృష్టిలో ఆ సంఘటన 1947వ సంవత్సరమున సంభవించినది. అంటే సూక్ష్మ ప్రపంచములో జరిగిన సంఘటన, స్థూల ప్రపంచములో జరుగుటకు 32 సంవత్సరములు పట్టినవి. భౌతిక ప్రపంచములో ఆవిర్భవించుటకు ఎంత అవరోధముండునో తెలియజేయుటకు ఈ విషయము నుద్ఘాటించిరి.

ఒక సృష్టియే కాదు, లయము కూడా యిట్లే జరుగును. నాశనము ప్రథమములో సూక్ష్మ ప్రపంచములో జరుగును. తదుపరి అనివార్యమైన పరిణామముగా స్థూలమైన ఈ భౌతిక ప్రపంచములో సంభవించును. కృష్ణభగవానుడు, గీతలో అర్జునునకిట్లు చెప్పెను:- నిన్నెదిరించి నిల్చిన ఈ సర్వసేనను నే నిదివర హతమార్చినాను. నీవు నా పని ముట్టువు-నిమిత్త మాత్రుడవు. (మయైవై తే నిహతాః పూర్వమేవ గీ. 11-33)

సావిత్రి, తిరిగి ఈ పృథ్వికి, తన మామూలు జీవితములోనికి వచ్చుచున్నది. ఆమె తన తుది జయమును సాధించినది. సర్వప్రపంచమునకు ఈ నూతన విజయమును కూర్చినది. దివ్య జీవనములో నెలకొల్పుకొని, ఈ భౌతిక వితములోనికి ప్రవేశించినది. కాని తనపై తన సిద్ధిపై నొక ఆచ్ఛాదమును ఒక ముసుగును వేసికొనినది. అది "మరియొక రోజు" సాధించవలసియున్నది. ఆ "ఒకరోజు" భౌతిక పదార్థముతో చేయబడినది. అది జరుగువరకు ఆమె బయటకురాదు. ఇప్పుడు తెర వేయబడియున్నది. దాని వెనుకనే ఆమె నిరి ంచిన దోష రహితమైన, పూర్ణమైన సుందరమైన కట్టడమున్నది. ప్రస్తుతము బాహ ముగా మనము

వెనుకటివలెనే ప్రమాద భూయిష్ఠమైన ప్రపంచ యావరణమునే చూచు చున్నాము. తప్పక తెరఎత్తబడును. దాగియున్నవన్నియు క్రమముగా గోచరము కాగలవు లేదా పెంకు బ్రద్దలై అకస్మాత్తుగా నూతన జీవితము పూర్తిగాను సంపూర్ణముగాను దృగ్గోచరము కాగలదు....అది ఎట్లు జరుగును....ఆయావిర్భావమును ఆ యతిమాన సావతారమును ఆ సంఘటనయే ప్రదర్శించగలదు. ఈ లోపు ఆ నూతన సృష్టిని "ఒక గొప్ప ఉషస్సు" తనలో దాచుకొని యున్నది.

"ఆమె యొక్క రహస్య కాంతి తెరల ద్వారా ఆ నూతన సృష్టి పరివ్యాప్తమైనది." (12-1-75)



## ప్రమాత ఆమె కర్మయొక్క స్వభావము
### (3rd Series)

ప్రమాతను గురించి యత్కించిత్తు మాటాడవలసినదిగా కోరబడితిని. ఆమె విత విశేషములు కొన్ని, ఆమె కార్యకలాపములు కొన్ని వివరించెదను.

ఆమె జీవిత ప్రథమ భాగమును ఫ్రెంచి దేశములో గడపినట్లుగా మీకందరకును తెలిసిన విషయమే. ఆ దేశములోని పారిస్ పట్టణములో ఆమె జన్మించెను. అందువల్ల ఆమె ఫ్రెంచి దేశస్థురాలిగను, యూరప్ వాసినిగను సహజముగా అనుకొనుట కలదు. కాని ఆమె దానిని ప్రతిఘటించుచు "నేను యూరప్ వాసినిని కాను, ఫ్రెంచి దేశస్థురాలను కాను" అని చెప్పుచుండెడివారు. ఇదియొక వింతగా తోచవచ్చును. కాని; వారి కుటుంబము ఈజిప్టుదేశము నుండి ఫ్రాన్సుకు వలస వెళ్ళెను. ఆమె తల్లి

దండ్రులు, ఆమె పుట్టుటకు పూర్వము, ఒక సంవత్సరము క్రితమే ఫ్రెంచిదేశమునకు వెళ్ళిరి. ఈజిప్టు దేశములో వారి కుటుంబము ఒక ప్రాచీన ఈజిప్షియను కుటుంబము. బహుశః ఈజిప్షియను 'ఫెరో' అను రాజకుటుంబమునకు చెందినదై యుండును. అందువల్ల ఆమె పెరిగినది ఐరోపా ఖండములోను, ఫ్రెంచి దేశములోను అయినప్పటికి, రక్త సంబంధ రూపేణ ఐరోపా ఖండవాసినిగాని, ఫ్రెంచి దేశస్థురాలుగాని కాదు. ఖచ్చితముగా చెప్పవలెనన్న ఆమె మధ్య ప్రాక్ దేశమునకు (Middle-East ) చెందినది. అనగా మధ్య ఐరోపా ఖండములోని తూర్పుభాగము, ఆశియా ఖండములోని పశ్చిమ భాగము కలసిన స్థానమునకు చెందినదై యున్నది. అంటే ఆశియా యూరోప్ ఖండముల కలయిక. ఆ రెంటి సమ్మేళనము— ఆ సమన్వయమే ఆమె జీవితము యొక్కయు దాని లక్ష్యము యొక్కయు సహజ ప్రకృతిని ప్రతిబింబింప యుచున్నది.

ఆమె జీవిత ప్రథమ భాగమును ఫ్రెంచిదేశములో కొనసాగించి నట్లుగా చెప్పియే యుంటిని. కాని; ఫ్రెంచి దేశములోనే ఎందులకు? ఆ ర్ణయములో ఒక అంతరార్థము కలదు. ఇప్పుడు మనకు ఆ అర్థము యుచున్నది. ఆమె జీవితము నందలి పరమార్థము— అనగా ఆమె త రహస్యము, జీవితము సాధించవలసిన పని— గోచరించు చున్నది. క్రొత్త వెలుగును ప్రసరింప చేయుటకు ఆమె జన్మించినది. ఆమె ప్రపంచమును గాని, పాత పద్ధతిని గాని, వాంఛించియుండలేదు. నూతన ప్రపంచమును, ఒక నూతన మానవ జాతిని ఆకాంక్షిం ఈ ప్రపంచమును, ఈ ప్రపంచమునందలి మానవ జాతిని పరి గావించుటకు గాను ఒక నూతన తేజస్సుతో ఆమె అవతరించినది. రిన క్రొత్త జాతికిని, ఫ్రెంచి దేశమునకునుగల సంబంధమేమి?

క్రొత్త వెలుగు ఆవిర్భవించుటకు నీవు దానిని ప్రప్రథమముగా మనో భూమికయందు అందుకొనవలెను. అనగా నీవు దానిని గుర్తించి, నూతన మైన ప్రకాశముగా తెలిసికొని ఆహ్వానించవలెను. మానవునిలో మనస్సే అగ్రస్థానము నలంకరించిన ఇంద్రియము. ఈ సందర్భములో బుద్ధ భగ వానుని ప్రబోధములలో "ధమ్మపద" మను గ్రంథములోని మొదటి వాక్యము "మనోపుబ్బంగమా ధమ్మా" అనునది (మానవుని సర్వప్రవృత్తు లకు మనస్సే ప్రధానము) స్మరణకు వచ్చుచున్నది. మనస్సు అన్నిటిని అధిగమించునది, అన్నిటిని ఆకళించు కొనునది. ఇప్పుడు ఆ వెలుగు నీలో ప్రవేశించి, ప్రసరించునప్పుడు ప్రథమమున నీశిరస్సును స్పృశిం చును_ అనగా నీ మనస్సులో ప్రవేశించును. నీవు దానిని చూడగలవు. ఆ చైతన్య స్పందనమును పొందగలవు. ఈ కాలములో ఫ్రెంచి దేశమే మానవజాతి శిరోభాగమై యున్నది. మానవజాతి నాగరికతా సంస్కృతు లకు ప్రధాన స్థానమలంకరించినది. మానవజాతి ఆమెలో పుట్టిన ఆ వెలు గును ఆమె ద్వారా అందుకొనగలుగుటకు ఆమె ఫ్రెంచిదేశములో జన్మించినది. అక్కడ ఆమె జీవితము, ఆదేశపు మేధావులు, చక్కని సంస్కారముగల శాస్త్రజ్ఞులు, కళాకారులు, కవులు, మొదలగు శ్రేష్ఠమైన విజ్ఞాన స్థాయిగల వారి సహవాసములో గడచెను. అక్కడ ఆమె వి తము ఎందుకుగడచెననగా, ఆమె సహవాస సహజీవనములవల్ల వారిలో ఆ క్రొత్త వెలుగును వెలిగించుటకే. ఈ లక్ష్యముతో అక్కడ ఆమె ఒక సం ఘమును, కొద్ది మందితో "Le Cosmique" ("విశ్వము") అను పేరుతో స్థాపించెను. విశ్వము అనగా సర్వప్రపంచము. ఆమె అందించు నదియు, ఆమె చేయునదియు సర్వ సృష్టికిని, సర్వమానవులకును, సం బంధించినదై యున్నది. ప్రాక్ పశ్చిమమను వివక్షత లేక సర్వులకును చెందినదై యున్నది. అంతేగాక అది విశ్వవ్యాప్తమై, సర్వసృష్టి యందలి

చైతన మునకును చెందినదై యున్నది. వ్యక్తిగతమైన అహంకార పరిధిలోని మనస్సును అధిగమించి, విశాలమైన మనోభూమికను ౘేరి, మనశ్శక్తులను వృద్ధిపరచి, ఒక నూతనమైన మానసిక స్థాయిని సృష్టించుచుండెను. నేను వెనుక చెప్పిన ప్రకారము మనుష్యులలో ప్రధానమైనది మనస్సు అనగా శిరస్సు. అందువల్ల ఈక్రొత్త వెలుగును ప్రప్రథమముగా మనస్సుతో గ్రహించుట మానవునకు సుసాధ్యము. ఈ సందర్భములో శ్రీ అరవిందుల **"The Golden Light"**('సువర్ణ జ్యోతి') స్ఫురణకు వచ్చుచున్నది. అందులో అది మొదట పై నుండి దిగి, శిరస్సును తాకి, మెదడులోనికి ప్రవేశించు విధానమును వర్ణించినారు.

అది నీ ఆలోచనలను ప్రభావితము చేయును. నీ బుద్ధిని వికసింపజేసి, నీజ్ఞానము విశాలమైన లోతుల నందుకొని, తీక్ష్ణమగునట్లు చేయును.నీవు దానిని అర్థము ౘేసికొనుట మాత్రమే చాలదు. నీవు దానిని ప్రేమించవలెను. అప్పుడే నీవు దానిని పొందగలవు. ఆ బంగారు కాంతి పుంజము నీ హృదయమును ప్రవేశించును. అక్కడనుండి క్రిందికి ప్రసరించి, స్థిర రూపమును దాల్చి, క్రియాత్మకమైన ప్రాణమయ భూమికను చేరును. చివరకు ఆ బంగారు కాంతిపుంజము నీపాదముల నందుకొనును అనగా నీ భౌతికావయవముల నావేశించును. అవిధముగా భౌతిక రూఢత్వమును పొంది, నీ శరీరమునందు స్థిరమై ఘనీభవించి, దానిని సౌందర్యమున కాలవాలముగ జేయును.

పై విధముగా, మాతృశ్రీ సృష్టిలో మూర్ధన్యమై, చైతన్యమును నిచ్చెన ఆఖరి మెట్టుగానున్న, మానవుని యందు దివ్యజీవన దీక్షను ఫ్రెంచిదేశములో ప్రారంభము ౘేసినది. ఆమె కార్యక్రమములో రెండవ దశ పని కొనసాగించుటకు ఆమె తూర్పుదేశములలో తూర్పునందున్న

జపానుదేశము · రినది, ఆ దేశములో అయిదు సంవత్సరముల కాలము గడిపినది. జపాను దేశమునందు 'Zen' ('జెన్‌సాంప్రదాయము') పద్ధతిలో ధ్యానము వ్యాప్తి కలిగియుండెను. అది హేతుబద్ధమైన మానసిక తనా విధానముగాక, అంతర్ముఖమై అంతర్దృష్టితో సునిశితమైన అంతః ప్రదేశమందు చేయబడు ధ్యానము. జపాను దేశస్థులు ఒక జాతిగా, సున్నితమైన సౌందర్యపిపాస, సుశిక్షితమైన కార్యాచరణలతో నిండిన విత విధానముగలవారై యున్నారు. ఆమె సహజసిద్ధమైన బంగారు వెలుగు భౌతిక ప్రపంచమునందు ఆవిర్భవించి, అది తనకై ఒకానొక శరీరమును సంతరించుకొనవలెనని జపాను దేశస్థులందు ప్రకటితమై, శుద్ధ రజోగుణ ప్రధానమైన కార్యశూరత్వము మిక్కిలి అవసరమై యున్నది. జపాను దేశపు "కుస్తీ వస్తాదులు" శారీరక బలమునందు శారీరక శక్తి ప్రాసారిక యమనియ మాదుల యందును ప్రఖ్యాతి నొంది యున్నారు. మీరు బొమ్మలలో వారిని పెద్ద పొట్టలతో చూచియే యుందురు. ఆపెద్ద పొట్టలను వారు శారీరక శక్తి గిడ్డంగులుగా నము చుందురు. దీనిని బట్టి నేను మిమ్ములను పెద్దపొట్టలు పెంచుకొనుమని చెప్పుటలేదు. పెద్ద పొట్టలు వద్దనియే చెప్పుచున్నాను. అయినప్పటికి కాయిక శ్రమలో శారీరక బలము కంటె ప్రాణికబలము చాల అవసరము. జపాను దేశస్థులకు సుశిక్షితమై, క్రమబద్ధమై, సునిశితమైన ప్రాణికశక్తి కలదు. ( ) టిల్లిగారి "ప్రార్థనలు-ధ్యానములు" అను పుస్తకములో ఒకటి రెండు ప్రార్థనలు మీకు జ్ఞాపకముండి యుండవచ్చు. జపాను దేశస్థులు సౌందర్య పిపాసకు చిహ్నముగా కళాభిమాన సూచకముగా, పరిశుద్ధమైన ఇంద్రియ దృష్టిగా ( ) తల్లిగారు చెర్రీ కుసుమమును (Cherry Blossom) గురించి వక్కాణించి యున్నారు. వారి రసజ్ఞత చవకబారుదై మోటుగాగాని, దుష్టత్వము కలదిగాగాని కాక, సునిశితమై, అంతరంగిక క్రమాహ్లాదముతో

సన్నిహిత సుఖస్పర్శను కలుగజేయునదై యున్నది. అదియే 'చెర్రీ' (Cherry – Blossom) కుసుమము (జపాను దేశమందుండు ఒక విధ మగు, సుందరమైన ఎర్రని పుష్పము) శ్రీ తల్లిగారు ఒక మనోదృశ్యమును ఒక అందమైన చిత్రముగా కూడ వివరించి యున్నారు. అదియే జపాను దేశపు మాత, ఆమె శిశువు– యీ మానవజాతియందా విర్భవించిన ఒక శిశువు అది. ఈ విధముగా ప్రపంచనిమిత్తమై చెర్రీ పుష్పరాజ దేశమైన జపాను దేశమందు ఒక నూతన ప్రాణిక ప్రపంచమును ప్రవేశ పెట్టినది.

శ్రీ తల్లిగారు సృజనాత్మకమైన చేతన. ఆమె ఎక్కడ ఉన్న ఎక్కడకి ఆహ్వానింపబడిన, ఆమె ఉనికియే, ఆదేశమునకు, ఆకాలము నకు అవసరమైన నూతన సృష్టి. క్రొంగ్రొత్త వ్యక్తులు, తన, సహ జముగా సృష్టింపబడుచునే యుండును. ఆమె సృష్టించునది పూర్ణమైన ప్రపంచమే. అది మానవుని యొక్క పరిణామములో, నూతన సిద్ధి వందు కొని, సృష్టియందు రూఢత్వమును పొందుచున్నది.

మన మనుకొను చుండిన శక్తివంతమైన ప్రాణిక జగత్తే ఆమె వెలుగును ప్రకటించి పోషించుటకు అర్హతగల శరీరమును రూపొందిం చుకొనును. ఈ కార్యక్రమమునకు ఆ సువర్ణజ్యోతి పాదముల (భౌతిక పదార్థము) యందు ప్రవేశింపవలెను. శ్రీతల్లిగారు ఇక్కడ చేయుచున్న పని ఇదియే మరియు ఇందు నిమిత్తమై ఆశ్రమ నిరాణము కూడ సి యున్నది. ఆమె శారీరక వ్యాయామమునందు ఎక్కువ శ్రద్ధను ప్రాము ఖ్యమును ఉంచి, మన శరీరము, ఇంద్రియములున్ను, ఆవెలుగును గ్రహించి, ధరించు సామర్థ్యము కలవిగా జేయు ప్రయత్నము మీ కంద రకును విశదమే. ఈ క్రొత్తవెలుగు ఈసవ్య · తనకు స్థిరమైన ఆధారము

నిచ్చునది వ్యాయామ విద్యయని ఆమె ఎల్లప్పుడును చెప్పుచునే యున్నది. ఈ బంగారు నూతనకాంతి వెలుగు నిచ్చునది మాత్రమే గాక శక్తిపాతము కలది కూడ అయి ఉండిన కారణము చేత దాని తాకిడిని తట్టుకొని, దాని ఆజ్ఞలను నెరవేర్చుటకు మనకు దృఢమైన దేహమును సుందరమైన శరీరమును శక్తిపాతమును భరించగల ఉపాధియును అవసరమై యున్నవి.

నిజముగా ఈ దివ్య ప్రకాశమునకు ఒక భౌతిక ఉపాధిని కల్పించి, దానికొక రూపము భౌతిక ఆకారమును సృజించుటకై మాత ఇక్కడికేతెంచెను. సుందరమైన శరీరసృష్టి యొకటియే పరమావధిగాని, సిద్ధిగాని కానేరదు. దీనిని సాధించుటకు ఒక సుందరమైన ప్రాణశక్తి కూడ కావలెను. అంతేకాదు, శా రక, ప్రాణిక సిద్ధులను పొందుటకు ఒక విశుద్ధమైన మనసు కూడ కావలెను. శ్రీ తల్లిగారు ప్రవేశపెట్టిన వ్యాయామ వ్యాసంగములు మనము సౌష్ఠవమైన శరీరములను తయారు సి కొనుటకే. ఆమె ప్రారంభించిన విద్యాలయము మానసిక శిక్షణ నిమిత్తమై యున్నది. మానసిక శిక్షణ అనగా అనేక పుస్తకములను చదివి బహువిషయములను గురించిన సమాచార సేకరణ మాత్రమే కాదు. మనస్సును శుద్ధిచేసి, నిర్మలముగా నుంచుట. ఆ మానసిక పదార్థము ఊర్ధ్వచేతనయై ఆ క్రొత్తవెలుగును వెతికి పట్టుకొన వలెను. ముందుగా దానిని నీ శిరస్సునందు ధరించి అటు పిమ్మట హృదయమునకు గొనిపోయి, తదుపరి క్రియాత్మకముగా నీ ప్రాణశక్తి యందు లీనము · య వలెను. నీవు దానిని గమనించి గ్రహించుటయేగాక దానిని ప్రేమించి, దానికి నీవు సమర్పితుడవుగావలెను. ఇక, ఇక్కడ మన కొసంగబడు తల్లిగారి కార్యము మనకామె నొసంగు ప్రత్యేక బహుమానము, అను

గ్రహము. నీవు ఏదైన వస్తువును ప్రేమించినప్పుడు, దానిని నీ హృదయ పూర్వకముగా ప్రేమింతువు. కాని; ఈ హృదయమునందు ప్రేమతో నిండిన వేరొక హృదయము కలదు. నిజమైన ప్రేమయనగా దివ్యప్రేమ. అది నీ ఆత్మ అనబడు ఈ అంతర్ హృదయమునందు కలదు. నీ నిజమైన వ్యక్తి, నీయందలి పురుషుడు, పైకి ఉబికివచ్చు నీ ఆత్మ అదియే శ్రీ తల్లిగారి ప్రత్యేక అనుగ్రహము. ఆమె దయతో మీ ప్రతి ఒకనికిచ్చు ప్రసాదము. ఆమె మీకు మీ ఆత్మను ప్రసాదించినది. దివ్యశిశువగు ఆ సన్నిహిత పురుషుని ఆ అంతర్వ్యక్తిని మీరందరును కలిగియుండుటయే ఇక్కడ మనలో ప్రతి ఒక్కరికి ప్ర్యేకమైన అదృష్టము. ఈ అంతర్పురుషుడే మీ దైవీ సంబంధమైన మనస్సును, పుష్టిగల ప్రాణమును, అందమైన శరీరమును—మీరు కోరతగినదంతయు ఈ ప్రాపంచిక జీవితములో ఎట్టి లోపములేక పరిపూర్ణతను ప్రసాదించుచున్నది. శ్రీ అరవిందుల సావిత్రి గ్రంథములోని సుప్రసిద్ధ పద్యపాదము బహుశ: శ్రీ తల్లిగారి వాచా మీరు విని యుండవచ్చును. మీ కందరకు జ్ఞాపకమున్నదని తలచెదను—

"బంగారు గోపురము కట్టబడినది
జ్యోతిర్మయ శిశువు ఉదయించినది"

శ్రీ తల్లిగారు బంగారు గోపురమను నూతన జీవితమును సృష్టించినది. అందు శిశువు వున్నాడు—హిరణ్మయ శిశువు. ఈ బంగారు బిడ్డ మీ అందరియందును కలదని మీరు తెలిసికొనవలెను, గ్రహించ వలెను. అదియే మీ జీవిత పరమావధి. అదియే మీరు ఈ భువిపై చేయ తగినట్టియు చేయ కోరునట్టియు పనుల యొక్క సాఫల్యము. మీలో కొందరు నిజముగా ఈ శిశువు యొక్క ఉనికిని అనుభవించియే యుందురు.

కొందరు దీనిని తమయందలి దివ్యశిశువుగా కనుగొని యుందురు. ఇవి-ఆకస్మిక దర్శనములనబడునవి- సాధారణముగా కలలో సంభవించును. వాటిని దర్శించిన వారిలో కొందరిని ఎరుగుదును. వారు వారి అద్భుతానుభూతులను నాకు చెప్పినారు. ఇట్టి అనుభూతులందరకును కలుగవచ్చును. మీకు ఆ శిశువు కనబడితే మీరు దానిని గ్రహించి, పట్టుకొని, ప్రేమతో ఆలింగనము సికొనవలెను. శ్రీతల్లిగారు ఇప్పటికిని మనలో సజీవులై పని యుచున్నారు. ఆమె ఉనికి ఇంకను ఇక్కడ వున్నది. స్థూలముగా కూడ వున్నది. ఎందుకనగా మీ అందరియిందును ఆ దివ్యశిశువు ఉన్నది గనుక.

కొంతకాలము క్రితము శ్రీతల్లిగారికి నేను చేసిన ప్రార్థనతో దీనిని ముగించెదను. ఈ ప్రార్థన చిన్నపిల్లల తరపున క్రీడాస్థలములో యబడినది-

"మధుర మూర్తివైన మాతా! నీ (దారంగమందలి శిశువులు దేవదూతలు. వారు ఈశ్వరీయతను పొందలేదు. కాని వారు దేవదూతలే. భూలోక దేవతలు. వారిని సర్వదా నీ పర్యవేక్షణ యందే యుంచుకొనుము. నీ ప్రేమమయ చైతన్యము నందే ఓలలాడింపుము."

మీ తరపున నేను (తల్లిగారికి సిన ప్రార్థన యిదియే. శ్రీ తల్లిగారు "అట్లేయగుగాక" అని సమాధాన మొసంగుదురని నాకునమ్మక మున్నది.

## 52

# మానవులు — దేవతలు

నేను సంస్కృతము నందలి ఒకానొక సామెతతో నా ప్రసంగ మును ప్రారంభించెదను. అది నిజముగా సామెత కాదు. కాని అది ఒక చమత్కారవచనము– హాస్యముగను, అర్థవంతముగను ఉద్దేశించి నుడు వబడెను. అందలి ప్రసంశనీయ ప్రధాన భావమును మీరే గమనింతురు గాక! బహుశ: ఒక కథ దీనిని గూర్చియే యున్నదను కొనెదను. సంస్కృత పండితులు– బహుశ: అందరు పండితులును సాధారణముగా లోకవ్యవహారము తెలియనివారను భావము ప్రచారములో గల విష యము మీకు తెలిసినదే. అంటే వారు గ్రంథపఠనముల యందు, శాస్త్ర విషయముల యందు నిమగ్నులై బాహ్య ప్రపంచముతో సంబంధము లేక లౌకికజ్ఞానము లేనివారై యుందురు. ఒకానొక సమయములో ఒక పండితుడు పంది యననేమియో తెలిసికొన యత్నించెనట! "నేను పంది, అడవిపంది, అనడము విన్నాను. అది ఏమిటి? నేను దానిని చూడలేదే". దానికి ఒకానొకరు సమాధానముచెప్పిరి. "అది ఒక పశువు." "ఎటువంటి పశువు?" అప్పుడు మరియొక పండితుడు తన పాండిత్యమును ప్రద ర్శించుచు ఇట్లు నుడివెను– "పంది ఎలుక కంటె పెద్దది, ఆకారము బాగా పెరిగి అది పంది అగును. "మూషిక వృద్ధి" లేదా ఏనుగుకంటె చిన్నది, ఏనుగును కుదించిన, పంది అగును. " గజక్షయము ". ప్రశ్న అడిగిన పండితుడు వికాసము పొందినవాడై "ఔను, ఔను నాకు ఇప్పుడు అర్థ మయినది. నాకు ఇప్పుడు అర్థమయినది" అనెను.

పై కథాంశమును తీసికొని మానవుడు కూడ ఈ సృష్టి క్రమములో మధ్యభాగమునందే యున్నాడని నేను చెప్పవచ్చును. ఒక వైపు నుండి మానవుడు వృద్ధిపొందిన పశువు (కాని సర్వత్ర శారీరక వృద్ధి కాదు)

పెంపుదలను, ఉన్నతిని పొందిన పశువు. మరియొక వైపున సంకుచితత్త్వము చెందిన దేవత. మానవుడు వృద్ధి పొంది పశుత్వము నధిగమించిన గాథ చాల విచిత్రమైనది. ఈ వృత్తాంతము పరిణామ సిద్ధాంతమునందు మీరు కొంతవరకు చదివియే యుందురు. కాని దానికంటె అద్భుతమైన గాథ భగవంతుడు లేదా ఒక దేవత ఎట్లు తనను సంకుచితపరచుకుని మానవ స్థాయిని పొందినదో తెలుపు చరిత్ర.

అతి ప్రాచీన కాలమున సృష్టియొక్క ప్రారంభ దశలో భౌతిక పదార్థముయొక్క అణువులు పరమాణువులుగా సర్వవ్యాపకమైన ధూళివలె కనిపించునవై యుండెను. వేదమునందు చెప్పబడిన 'తుచ్ఛః' అన్నట్లు. ఇప్పుడు మనము చూచుచున్న రూపములుగాని, ఆకారములుగాని, నానావిధ శరీరములుగాని లేవు. అది ఒక అస్పష్టమైన మేఘమువలె, పొగమంచు, తుషారమువలె నుండి అసంఖ్యాకములైన కణములు పరిభ్రమించుచున్నట్లుండెను. ఈ సృష్టి ఆ విధముగా ప్రారంభమైనది. అటుపిమ్మట ఆ కణములు, నెమ్మదిగా క్రమముగా దగ్గరపడి, ఒకదాని యందొకటికలసి సమ్మిశ్రితమై ఘనీభవించి, చిన్న పెద్ద అనేక విధములైన రూపములను ఆకారములను పొంద మొదలిడెను. అప్పుడు ప్రప్రథమముగా నక్షత్ర సమూహములతోకూడిన అంతరిక్షము (ఆకాశము) గోచరించెను. అటు పిమ్మట, ఈ భూమి ఒక విశిష్టమైన స్వభావము, నియతి (విధికృతము) కల్గి ఆవిర్భవించెను. నేను ప్రాథమికమైన అణుధూళి విచ్చలవిడిగా వ్యాపించియున్న విషయమును చెప్పియే యుంటిని. కాని వాటితో బాటు ప్రతి కణముతోను కలసి మరియొక పరిమాణములో అద్భుతముగా కాంతి కణములుకూడ ఉండెను. మనము ఇదివరలో భౌతిక పదార్థముయొక్క అణు పరమాణువులను గురించి

వినియే యుంటిమి. కాని యిటీవలి కాలములో యీ కాంతికణముల ఉనికిని కూడ అనుమానించు విషయములు వినుచుంటిమి. ఈ కాంతి భౌతిక పదార్థము యొక్క వెలుగు మాత్రముకాదు. కాని ఇది చైతన్యముయొక్క కాంతి. ఒక అద్భుతమైన విషయము జరిగినది. అది యేమనగా : భౌతిక పదార్థ కణములతో బాటు ఈ కాంతి కణములు కూడ పెరిగి వృద్ధిపొందినవి. ఈ భౌతిక పదార్థమను మట్టిముద్ద, అనేక మార్పులకు లోనై, చేతనాత్మకమైన పదార్థములు, జీవభూతములు, పశుపక్ష్యాది శరీరములు, తుదకు మానవ శరీరముగా వికసించినది. అటులే ఆదిలోని కాంతి కణముకూడ ప్రారంభములో తమస్సు (చీకటి) చే ఆవరింపబడి దృశ్యాదృశ్యమై మినుకు మినుకు మనుచుండినదై, నెమ దిగా. క్రమముగా, అనివార్యముగా, స్పష్టమై, బలమును, విస్తారతను పుంజుకొనినది. అది ఒక సుస్పష్టమైనఆకారమును పొందుటకు, చాలా కాలము, కోట్లకొలది సంవత్సరముల కాలము పట్టినది. ఇదియే వస్తు సముదాయము నందలి ప్రతి వస్తువు యొక్కయు, ప్రతి వభూతము యొక్కయు, హృదయము, తనా ం్రదము అయినది. మానవునిలో ఇది యొక ఆశ్చర్యకరమైన పరిణామమును పొందినది. ఈ కాంతికణమునకు, మొదట నేను చెప్పినట్లు రూపములేదు. అగుపించని చుక్క. అది వృద్ధిపొందినకొలది ఒకానొకస్థితిలో జ్వాలారూపమును పొందసాగినది. కొవ్వువత్తి దీపమును చూచి యుందువు. అది కోణాకారమును కలిగియుండును. కోణాకారము బాగాపెరిగిన సుస్పష్టమైనరూపము. నేనిదివరలోచెప్పినట్లు మానవాకారము ఆవిర్భవించినపుడు ఈ జ్వాలకూడ మానవాకారమును పొందినది. చిన్న మానవ స్వరూపమైనది. ప్రకాశమానమైన పిండమువలె అయినది. ఖ్యాతి గాంచిన ఉపనిషత్తులో నిట్లున్నది "అంగుష్ఠమాత్ర : పురుషః-అంతరాతా

పురుషః", ఒక మూర్తి అంగుష్ఠ పరిమితిగల ఒకవ్యక్తి. అదియే ప్రప్రథమముగా రూపమునుదాల్చిన మానవాత్మ అయివున్నది. అదియే పురుషరూపమును, చైత్యపురుష స్వరూపమును పెంపొందించుకొనిన ఆదిలోని కాంతి కణము అయి ఉన్నది. మానవునిస్థాయిలో ఒక అత్యద్భుత పరిణామము సిద్ధించినది– ఆ వెలుగు, ఆ పెరుగుచున్న చైతన్యము వెనుదిరిగిచూడగల శక్తిని పొందినది. అది స్వప్రకాశ జ్ఞానము కలదియై అక్కడ నుండి మరియొక భూమికలోనికి, అంతకంటె విశాలమైన పెంపుదలగల మరియొక భూమికలోనికి మొదటి గంతు వైచినది. వ్యక్తిత్వమును చెందిన లేదా పురుషాకారమును పొందిన చైతన్యవికాసమును ఆ చైతన్యపురుషుని విస్తృతమగు శోభయును ముందునకు సాగిపోవుచూ మానవ పరమావధిని నిర్ణయించి మానవుని అంతర్జీవితగాథను విశదీకరించు చరిత్ర అయి ఉన్నది. ఆ కాంతి ఎట్లు పెరిగి పెద్దదగు చున్నది? ఆ కాంతి కణమును పొదిగి జీవభూతముగా, ఆ జీవభూతములను ఇతోధికోన్నత భూతములుగా, పెంపొందించు శక్తు-వి? ఆ అభివృద్ధిని సృజించి సాధించు సహాయకారులైన విషయము లేవి? ప్రాణమొక సహాయకారి. ప్రాణశక్తులు ఈ పనిని సాధించు శిల్పులు. ప్రాణము ( జీతము) అనగా క్రమముగా సంప్రాప్తమగు అనుభవముల సంపుటి. అనగా, నీ చుట్టును వున్న ప్రపంచము నీ మనస్సు, నీ శరీరము, నీ యింద్రియముల–పై తెచ్చు ఒత్తిడియే. ఇవి అగ్నిలో పడవేయు కట్టెల వంటివి. జ్వాలను ప్రజ్వలింప యునవి. జన్మాంతరములలో, ఈ అనుభూతులను సంపాదించి, నీ వ్యక్తిత్వమును బలిష్ఠముచేసి వ్యక్తిగత సామగ్రిని విస్తృతపరచును. అట్లు జరుగుచుండ ఒకానొక సమయములో ఆత్మ జ్ఞానముగల చైత్య పురుషుడు పెరిగి, వృద్ధిపొంది, సుస్థిరమైన రూపమును యోగ్యతను కల్గి ఆధ్యాత్మిక జీవితమును గురించి యోచింప మొదలిడును.

ఎప్పుడైవ్యక్తి తను ఉన్నస్థితితో సంతుష్టిపొందక సాధారణ ప్రాపంచిక జీవితముతో తగినంత తృప్తిలేక అవ్యక్త వ్యథతో ఒక అతీతమైన వస్తువునకై ఆకాంక్షించునో అప్పుడు నీలోని జ్వాల జీవిత పరిమాణములలో మరియొక భూమికలోనికి దుముకుటకై ఒక విలక్షణ మైన స్థాయికి చెందినట్లుగా తెలిసికొనును.

నీయందు ఆధ్యాత్మిక జీవితమునకు ఆకాంక్షరేకెత్తినచో, నీయొక్క సత్య స్వరూపమైన అంతర్వ్యక్తి దర్శనమైనట్లుగా తెలిసికొనుము. నేను తరచు మీకు విశదీకరించు చుండినదే ఆ సుందరమూర్తి అయిన అంతరాత్మ. ఈ అంతరాత్మద్వారా నీవూ ఆధ్యాత్మిక జీవితానుభవముల· వృద్ధి పొంది, సౌష్ఠవమైన వ్యక్తిత్వమును క్రమముగా పెంపొందించుకొనుచూ, తుదకొక పూర్తిగా వికసించినట్టియు, పరిపూర్ణత నందినట్టియు, సుందరాకారమును పొందగలవు. మానవుడు అట్టి పూర్ణమైన ఆత్మ స్వరూపము నందినపుడు పూర్వకాలములో, వానిని "సిద్ధ పురుషుడు" అని నుడువు చుండిరి. సిద్ధ పురుషుడు అనగా పరిపూర్ణమైన సిద్ధిని పొందినవాడు. సిద్ధుడు అనగా సాధించినవాడు, పూర్ణత్వమునందినవాడు– మానవ జీవితము యొక్క సాధారణ పరమావధినందినవాడు. నీ అంతస్తేజస్సు– నీలోనున్న వెలుగు– నీవు జన్మాంతరములో కూడగట్టి వృద్ధిపొందించుకొనిన వెలుగు. ఒక పరిపూర్ణతను అందుకొనినది. నీవు అనేక మార్గములను త్రొక్కితివి. గత జీవితములలో అనేక అంతరాయములకు లోనైతివి. ఈ పూర్ణస్థాయి నందుకొనుటకు కష్టభూయిష్ఠమైనట్టియు క్లిష్టమైనట్టియు నడకలు నడచి, అడుగులు వేసి, స్థాయుల నధిగమించి, ప్రయాణము చేసితివి. కాని నీవు చేరినది తుదిమెట్టు కాదు. ఇక మరియొకవైపు పయనించి, మరియొక వికాసమునందుకొనవలసి యున్నావు. మానవుని యొక్క పరమావధిలో మొదటి అర్థభాగము పరిపూర్ణమైన మానవుడుగా రూపొందుట, మిగిలిన అర్థభాగము మానవుడు దైవత్వమునందుట అనగా దివ్య పురుషుడుగా రూపొందుట.

కాని ఇకనుండి జరుగవలసిన విధానము వేరు. ఎందువలన అనగా, పరతత్త్వము యొక్క మరియొక పరిమాణము లేదా గుణములో ప్రవేశించవలసి యున్నది. దేవతలను, పూర్ణత్వము యొక్క భిన్నభిన్న రూపములుగా చెప్పవచ్చును. వారి చైతన్యము మానసిక చైతన్యము వంటిది కాదు. సంకుచితత్త్వములేని అఖండ చైతన్యము. ఒక్కొక్కరు ఒక్కొక్క గుణమునుగాని కొన్ని గుణములను గాని కల్గియుందురు. ఒక్కొక్క దేవత ఒక ప్రత్యేక శక్తి. మానవస్థాయిలో అభివృద్ధి క్రమగతి కల్గి పైకి, మెట్టు తరువాత మెట్టుగా ముందుకు సాగిపోవుచుండును. ఆ సాధనాగతి గాని, సిద్ధిగాని, · ర్పు కూర్పులతో కూడినదై యున్నది. కాని, నీవు దైవత్వమును దైవతత్త్వమును పొందుట అనగా నీవు కోరిన వస్తువును పట్టుకొని, స్వాధీనము సికొని, పొందుటవంటిది కాదు. ఇక్కడ నీవు దేవతలను పట్టి వశపరచు కొనలేవు. కాని వారు వచ్చి నిన్ను వశపరచు కొందురు. వారు నీపై వాలి నీవద్దకు వత్తురు, ఉపనిషత్తులో నిట్లు చెప్పబడెను. "వాడు తనంతట తానే ముందుకు వచ్చి, తన ఉనికిని తానే బహిర్గతము సికొనును." వారు అట్టి విశిష్టమైన గుణము కలవారు. ఆభిన్నత్వము, పరిమాణమునందే గాక, జాతియందు కూడ కనిపించును. నీవు ప్రస్తుతమున్న స్థితిని, స్వభావమును, పెంచి గాని విస్తరించిగాని, వృద్ధిపొందించిగాని, ఆ విశిష్టమైన దైవీ స్వభావమును పొందజాలవు. నేను పైన చెప్పినట్లుగా ఆ స్వభావమే దిగివచ్చి నీలో ప్రవేశించి, నిన్నే తనదానినిగా, తన జీవిత విధానముగా సి కొనును. ఇదియే ఇప్పుడు మానవుడు సాధించవలసిన నూతన సిద్ధి; దైవీస్థాయిని, దైవీ తత్త్వమునందు కొనవలెను. మానవుడు యీ విషముగా పరిణామమును చెంది, దైవీగుణ సంభూతుడై, దేవుడుగానే రూపొందవలెను. ( ) అరవిందులు దివ్యజీవనమును గురించి, భాగవత

వనమును గురించి అనగా దైవీపురుషుని జీవితమును గురించి, వక్కాణించి యున్నారు. నీవు నీ మానవప్రకృతిని అధిగమించి, దైవీ ప్రకృతిని నీలో నెలకొల్పు మానవుడుగా పరిపూర్ణత్వమును సిద్ధింపచేసికొనుటయే గాక దివ్యాత్మ స్వరూపుడుగా రూపొందగలవు. పరిపూర్ణత్వమునందిన మానవులను రెండు తెగలుగా శ్రీరామకృష్ణ పరమహంస విభజించి పలుకుట మీకు జ్ఞప్తియందున్నదని తలచెదను– ఒకతెగను జీవకోటి, అనగా సిద్ధిని పొందిన పరిపూర్ణ మానవులు. సాధారణముగా వీరు తమ వ్యక్తిగత సాధనను సాగించి, అందు సిద్ధిని పొంది, ఈ ప్రపంచము నుండి తరలిపోవు చుందురు. వారు తిరిగి జన ను పొంది ప్రాపంచిక జీవితములో కాలిడరు. రెండవతెగ జీవులు "ఈశ్వరకోటి" లోని వారు. వీరు దైవాంశ సంభూతులై, దైవీప్రకృతి కలవారై, తాము తరించుటయే గాక యితరులను కూడ తరింప యుదురు. వీరు అజ్ఞాన భూయిష్ఠమైన అసమగ్రతను భరించి, తాము సంపూర్ణమయిన సిద్ధిని పొందియు, జన్మజన్మాంతరములలో క్రిందికి పైకి యథేచ్ఛగా సంచరించుచు యీ యావత్ప్రపంచము యొక్క సంపూర్ణ స్వరాజ్యమును స్థాపించుటకై ఈ ప్రపంచములో కర లను (కర్మయోగమును) కొనసాగించుచుందురు.

దేవుడు దిగివచ్చి మిమ్ము వశపరచుకొని తనవాడినిగా సికొనును గాని, మీరు ఊర్ధ్వలోకములకు పోయి, భగవదాశ్రయమును పొందుట కాదు. ఇది అంతయు, వివరించి చెప్పు విధానములోని చమత్కారము మాత్రమే అయిఉన్నది. నీలోనికి ఆహ్వానించి నెలకొల్పుకొను దైవీమూర్తి నీయిష్టదైవతయే అయి ఉన్నాడు. అతడు సదా నీ శిరస్సు ఉపరిభాగమునందుండి, నీ ఆధ్యాత్మికపరిణామ పరిభ్రమణములలో, నీకు సలహాదారుగా సహాయకారిగా, స్నేహితుడుగా, నిన్నంటి

పెట్టుకొని యుండును. నీ . వితమునావరించి, నీతో తాదాత్మ్య మును పొంది, నీవు ఆ విశిష్టమైన దివ్యతత్త్వముగా రూపొందినట్లు చేయునది, నిజమునకు నిన్ను ఆది నుండియు అంటిపెట్టికొని యున్నట్టియు, నీ అభివృద్ధి క్రమముతో సమానముగా నీతో క్రమ సన్నిహితత్వమును పొందినదియు నేను లోగడ మీకు చెప్పిన, మీయందలి కాంతికణమే అయి ఉన్నది. అది నిజమునకు యీ భౌతిక ప్రపంచములోనికి దిగి వచ్చిన దివ్య పురుషుని యొక్క దివ్య తత్త్వము యొక్క అంశ మాత్రమే ఉయి ఉన్నది.

మానవుడు దైవాంశ సంభూతుడుగా పూర్ణమైన మార్పునుచెందిన వారిలో నారదుడొక, మహత్తరమైన, ఉజ్జ్వల ప్రతీక అయివున్నాడు. అందువలన ఆయనను దేవర్షి అని పిలుతురు. అనగా ఋషి పుంగవుడు, పూర్ణమానవుడు. ఆధ్యాత్మిక పరిణామమును పొంది సాక్షాద్దేవుడుగా మారి దిగివచ్చి మానవ వ్యక్తిత్వమును పొంది మానవమూర్తిత్వమును వాస ముగా గలవాడే ఋషి. ( ) అరవిందులు రచించిన "సావిత్రి" అను బృహత్కావ్యములో నారదుని వంటి దేవర్షి యవలసిన కర్తవ్య ధర్మ మును చక్కగా వివరించి యుండెను. ఆయన అమృతత్త్వము నొంది చావులేని వాడై, ఊర్ధ్వలోకములలో సంచరించుచు జీవించుచున్నాడు. ఆయన యీ భౌతిక వాతావరణము లోనికి అవతరించుచు, ప్రాపంచిక ఉద్యమములలో, ప్రేమ పూర్ణమైన ఆదరాభిమానములు కలవాడై మార్గ దర్శకుడగుచుండును.

అయినప్పటికీ, మానవ పరిణామములో నారదుడు పొందిన స్థాయి ఆఖరిమాటగాని, ఆఖరిమెట్టుగాని, కాదు. ఆయన సూక్ష్మ ప్రపం చములోని అడుగుభాగమున వున్నవాడేగాని, భౌతిక శారీరక పరివర్తన

మును పొందియుండలేదు. శ్రీ అరవిందులు నుడివిన దివ్యజీవనమున ఉపాధియగు హిరణ్మయదేహమును పొంది యుండలేదు. మానవప ణామ క్రమములో రాబోవు స్థాయిగాని, సిద్ధిగాని, మానవ శరీరమును దివ్యతత్త్వము , పరిణామము కావింపబడిన దివ్యశరీరముగా మాట టయే అయి ఉన్నది.



## రెండువరుసల నిచ్చెన

మొదటనే మీకు చెప్పితిని గదా! ఈ సృష్టి ఆదిలో భౌతిక పదార్థము యొక్క అణు సమూహములు అంటే అణుధూళి యీ అనంతమైన ఆకాశములో, కోటానుకోట్ల కణములై విచ్చలవిడిగా వ్యాపించి యున్నదని. ఆ కణములు క్రమక్రమముగా దగ్గరపడి ఘనీభవించి ఘనత్వ పరిమాణమును పొంది ఆకారములుగను, మూర్తులుగను మారినవి. క్రమముగా జడస్వభావము నుండి చైతన్య స్వభావమును పెంపొందించుకొని అవి వరాసులుగా చైతన్య మూర్తులుగా చివరకు ఆత జ్ఞానముగల మానవులుగా మారినవి. ఈ జడమైన, నిర్జీవమైన, భౌతిక అణువులతో కలిసి సమైక్యతను పొందిన తేజోకణములు కూడా వుండెనని నేను చెప్పియే యుంటిని. అవి, వట్టి భౌతిక పదార్థము యొక్క శక్తులు మాత్రయేగాక, అవి చైతన్యశక్తితో సమ్మిశ్రితమై సంపర్కము సహవాసముగల కాంతిశక్తులు. జడపదార్థమే గాక దానినంటి వెనుక ప్రకాశమానమైన చైతన్యముండుటవలననే ఈ వైవిధ్యము గల పరిణామమునకు అనగా చైతన్యము గల మూర్తులు, వము గల భూతములు సృష్టిలోగల సర్వ వరాసులును అగుటకు సావకాశము కలిగినది. ఈ పరిణామము మానవసృష్టి వరకును కొనసాగుచునే యున్నది. కాని యీ

మానవస్థాయి నుండి ఈ పరిణామము యొక్క ప్రయాణము అతికష్ట ముగా నడచుచున్నది.

ఈ చైతన్యము, ఈ కాంతికణము ఎక్కడ నుండి దిగివచ్చినది? నిజ మునకు జడపదార్థకణము ఎక్కడనుండి దిగివచ్చినదో అక్కడనుండియే! సనాతన ఋషులు, ఈ సృష్టి అంతయు సత్తనుండి-పురుషుడు, శుద్ధపురు షుడు నిరాఘాటమైన ఉనికి నుండి పుట్టినవని నొక్కి వక్కాణించినారు. అది సంపూర్ణమైన ఏకత్వము, అవి భాజ్యము, నిశ్చలము. దానికి మరి రెండు ప్రధానమైన గుణములు కలవు. అవి చిత్తము, ఆనందము. ఈ రెండును ఆ పురుషమూర్తితో సమ్మిశితమై పోయినవి. ఐనప్పటికి ఈ పురుషునిలో ఒక సంచలనము, ఒక కదలిక, (ఏకత్వము అవిభాజ్యము సందొక) ఏర్పడినది. ఈ కదలిక అనేకమున కుద్దేశించబడినది. ఈ స్థితి పురుషుని తలక్రిందుగా విరుద్ధ దిశకు అనగా జడపదార్థము వైపు, అం త నము వైపు, వేగముగా పురోగమించుటకు దారితీసినది. అక్కడ అది ముక్కలు ముక్కలై అనంతమైన అణువులుగా అయినది. ఆదిలోని చైతన్యాత కమైన పరమ పురుషుడు, అనేకత్వమును పొందుటకు పర స్పర విరుద్ధ వస్తువులుగా అగుపించును. కాని మొదటిలోని విభాగము- అనగా అధోముఖ పతనముయొక క్రమగతి కల విభాగము. అది ఒక విధమైన అనువంశికమగు విస్తృత స్వభావముగల కార్యక్రమము. ఇది మొదటి విభాగముతో ఆగక, అనంతముగానై అధోముఖమై, అపరి శుద్ధము, అసంపూర్ణము, సంకుచితము, దట్టమునై, విలువలు కూడ క్రమ ముగా సన్నగిల్లి, తుదకు శిలావేదికయగు భూమి తగులువరకు చీలి విడి పోవుచున్నది. ఇక్కడ, విభాగము, అందుండి తిరిగి విభాగము అగు టను విప్పి చెప్పుటకు ఒక ఉదాహరణమును, చిత్రకల్పనను చెప్పుచు

న్నాను. మొదటి విభాగములో, పరబ్రహ్మ స్వరూపుడు చీలి రెండు అస్తిత్వములుగల వాడుగా అయినాడు. అదియే ఈశ్వరుడు-ఈశ్వరి. ఈ చీలిక క్రిందికి ప్రసరించి-చైతన్యములో-విభాగమై చైతన్యము తక్కువ అగుచున్న వివిధ మూర్తులుగా అయినది. వర్తమాన కాలము యొక్క భౌతిక పరిణామములో, ఆ పరమేశ్వరి యొక్క శక్తులు నాల్గు రూపములను ధరించినట్లు శ్రీ అరవిందులు నుడువుచున్నారు. అవి అమోఘమైన పరాశక్తులు. అవి అతీతమానస చైతన్యమని పిలువబడు స్థాయి నుండి అవతరించినవి. అవి ఇంకనూ దిగువయున్న మానవచైతన్య పరిసరములకు మానవులకు అందుబాటులో నుండుటకు గాను, కొన్ని దివ్య మూర్తులను వ్యక్తులను పంపినవి. అవియే ముఖ్యముగా అతిమానస స్థాయిలో వున్న దేవతాస్వరూపములు. అవి మానవజాతికి నిర్ణయింపబడిన విధి యందాసక్తి కలవై, మానవుల ఇష్టదైవతములై మానవులతో వ్యక్తిగత సంబంధముల నేర్పరచు కొనుచున్నవి.

ఇప్పుడు ఈ అధోముఖగమనము పరబ్రహ్మ స్వరూపమైన చైతన్యము నుండి అతిమానస చైతన్యములోనికి (Supramental) అక్కడ నుండి అధిమానస (overmental) చైతన్యము లోనికి తదుపరి మానసిక చైతన్య కక్ష్యలోనికి (mental) దిగివచ్చి, యిక్కడ అనేక దేవతల నివాస స్థానములుగా నైనవి. అది ఇంకనూ అధో భాగములలో తమస్సు దట్టమైన ప్రదేశములలోను అజ్ఞాన భూయిష్టమైన రూపములలోను, అది చిన్నచిన్న దేవుళ్ళుగా మార్పు చెందినది. అధో భూమికలలో అనగా దట్టమైన చీకటితో ఆవరింపబడి, చైతన్యము యొక్క అజ్ఞానాకారములతో నిండిన యీ అధో లోకములలో-చిన్న చిన్న దేవుళ్ళుగా, అంగుష్ఠ మాత్రులగు దేవతలుగా అగుచున్నది. వేద కాలపు ఋషులు వీరికి కూడ, తమ నమోవాకములను, ఆహారమును

అర్పించి యున్నారు. దేవతలు యింకను మన భూమి యొక్క వాతావరణము లోనికి · రి వ్యాపించిరి. వనములు, నదీనదములు, పర్వతములు, మిట్టలు, మొదలుగాగల దేవీదేవతల స్వరూపములతో పురాణములలో వివరింపబడిన అది యొక మహాప్రపంచమే అయియున్నది. అవి వట్టికల్పనా భావములుగాని, నిరాధారమైన, నిస్సారమైన మనోరచనలు గాని కావు. ఆదిమజాతి మానవులలో కొన్ని తెగలు, యీ విభజన కథను, తమస్సు ఆవరింపబడిన సృష్టిలోని జీవభూతములకు చైతన్యమునకు అనగా అ· తనము, రూపరహితమగు, భూమికల లోనికి కూడ కొన సాగించినారు. కాదు, నన్ను చెప్పని· ్చ యడల, రాళ్ళు రప్పలనైనను వదలలేదు. అవి జడపదార్థ రూపములైన తమయందు సంక్రమించిన ఈ దేవతాంశను ఏ మాత్రమునైన నెలకొల్పుకొని యున్నవి.

ఈ విషయమున మానవుని ప్రమేయమను ప్రశ్నలేదు. అతని ఆలోచనలు గాని సంకల్పములుగాని, చొప్పించు ప్రశ్నలేదు. అది పూర్తిగా వేరేవిషయము. నేనిక్కడ నుడువునది ప్రతివస్తువు నందును, భౌతిక రూపము నందు సహజసిద్ధమైన ఆధ్యాత్మిక అంతస్తు, భగవత్తత్త్వము-అద్దాని ద్రవ్యగుణము-అనగా "లింగాకారము" "కాబా" యందిమిడి యున్న దివ్యగుణము అని.

కనుక, మనమీసృష్టియందు రెండు రకములైన పెరుగుదల, అభివృద్ధి అభివ్యక్తమగుచున్నది. ఒకటి క్రిందినుండి మీది కెగబ్రాకునది. రెండవది మీదినుండి క్రిందికి ప్రసరించునది. ఇది ఒక విధమైన రెండు వరుసల నిచ్చెన వంటిది. అవి నిజమునకు సృష్టిక్రమమును వర్ణించు వంశవృక్షముల వంటివి. ఊర్ధ్వముగా పోవు వృక్షము, మూల పదార్థమైన మట్టినుండి బయలుదేరి, క్రమముగా ప్రమానుకట్టి, వివిధ

శాఖోపశాఖలై విస్తరించుచున్నది. ప్రతిక్రొత్తశాఖ ఒకానొక నూతన జీవభూతమునకు గాని జీవరాశికిగాని ప్రతీకగా ఆవిర్భవించుచున్నది. ఈ పరిణామదశలు నిరాకారము నుండి యారంభమై అనాకారము, అక్కడి నుండి మంచి మానవాకారము వరకు దాని తరతమ స్థితులగుండా అంత కంటె మంచి రూపములు ఆవిర్భవించువరకు, ఈ విధానము మనకు తెలిసినదే. ఇక రెండవ వృక్షము వేదములలోచెప్పబడిన అశ్వత్థవృక్షము. దాని వేళ్ళు అత్యున్నత ఊర్ధ్వలోకమున ఉండి దాని కొమ్మలు క్రిందికి ప్రసరించుచున్నవి. ప్రారంభమున ఏకత్వము కల్గి, క్రమముగా విడివడి విభాజ్యమై, అనేకమై, ఆ అ- కములు క్రమముగా ప్రత్యేకతను నియమిత రూపమును తుదకు ఘనీభూతమైన సంకుచితత్వమునుకల్గి, స్థిరమైన ఆకారమును ప్ర యకమైన ప్రయోజనమును కల్గినవగుచున్నవి. ఈ పరంపరలో బహిర్గతమై ఆవిర్భవించిన రూవములను, కూర్పులను విభూతులను నేను సాధారణమైన నామముతో దేవతలనుచున్నాను. వీని యొక్క కర్తవ్యమేమన, అడుగునుండి పైకి కొనసాగిపోవు పరిణామగతిలో, ఊర్ధ్వముఖమైన ఆకాంక్షచే తయారు · యబడిన మూర్తుల అవసరము ననుసరించి వారిలో ప్రవేశించి, వారి ఆంకాంక్ష సిద్ధికి తోడ్పడుట అయి ఉన్నది. కాలానుగుణమై స్థాయికి తగిన దివ్యతత్త్వము ముందుకు వచ్చి బాహ్య సృష్టిలో మూర్తివంతమైనదగును. సూచన ప్రాయముగా ప్రతీకములుగా ఈ పరిణామక్రమము జయదేవుడు వర్ణించిన అవతారములలో కొంతవరకు తెలుపబడెను.

నేను చెప్పిన దేవతలు ఒక జాతిపై స్వతఃసిద్ధమైన అస్తిత్వములు కల్గి నూతన సృష్టికి మూసలై ఉన్నవి. అవి భౌతిక ప్రపంచములోనికి చొచ్చుకొని వచ్చుచున్నవి. వాటిని క్రమబద్ధము చేసి వ వస్థీకరింపవలసి యున్నది.

ముఖ్యముగా నూతన సృష్టిలో అగ్రస్థానమునందుకొనిన మానవుని కారణముగా భౌతిక ప్రపంచము యొక్క స్థితి విషముగామారి యుండుటే గాక ఇంకను మారుచునే యున్నది. మానవ చైతన్యము, తానున్న స్థాయినుండి ఈ భౌతిక ఉనికిలో మరియొక పరిమాణము లోనికి దుముక వలసిన సమయము యేతెంచినదని నేనిదివర చెప్పి యుంటిని. ఇప్పుడు దేవతలు, మానవునిపై నావరించి, సమయమును చిక్కబట్టి, నూతన సృష్టినారంభింపనున్నారు. మానవులు తమ వితములలో దేవతలుగా మారి నూతన చైతన్య పురుషులను, తనాత్మకమైన జీవితవిధానములను అభివ్యక్తము యవలసి యున్నది.

దేవతలు, మానవజాతి దరి రుచున్నారు. దేవతల యొక్క స్థాయిలో మానవజాతియే ఒక మార్పును తీసికొని రావచ్చును. వారు తమ జాతిసంబంధమై స్థిరత్వమును బిగింపును సడలించుకొని మానవ మృదుత్వమును అలవరచుకొనవచ్చును. ,త ఈ విషయమునే తన పద్ధతిలో ఇట్లు చెప్పినది. "మానవులు దేవతలను భజించియు, దేవతలు మానవుని అనుగ్రహించియు వారు పరస్పర సహకారముతో వృద్ధి పొందుదురని". బహుశః మానవుడందుకొను దివ్యతత్త్వము భగవత్తత్త్వము యొక్క విలువ మెరుగుపెట్టునేమొ. శ్రీ అరవిందుల "సావిత్రి"(బృహత్కావ్యము)లోని ఈ దిగువపదమును స్మరింతుముగాక!

"మానవుని విధి ఘనతనందిన దేవత."

---

# అంచుకోన

ఏకం పాదం నోత్ఖిదతి సలిలాద్ధంస ఉచ్చరన్।
యదఙ్గ సతం ఉత్ఖిదేన్ నైవాద్య న శ్వఃస్యాన్
న రాత్రీ నాహః స్యాన్ నవ్యుచ్ఛేత్ కదాచన॥
(అథర్వవేదము 11-4-21)

"జలము నుండి పైకెగరు నప్పుడు హంస తన పాదములలో ఒక దానిని ఎత్తదు. ఆ రెండో పాదమును కూడ ఎత్తెనో అప్పుడిక నేడు, రేపు అనునవిగాని, రాత్రి పగలు అనునవి కాని, ఉదయము గాని ఉండ నేరవు" అని వేదర్షి పలికెను.

అట్లే తల్లిగారు, ఈ భువినుండి శారీరకముగా నిష్క్రమించి నప్పుడు, ఆమె ఒక పాదముతోనే నిష్క్రమించినదని మనము భావించి తిమి. ఆమె తన రెండవ పాదమును ఇక్కడ సుస్థిరముగ మనము పూజించుటకై నిల్పినది. ఇది యొక భావన మాత్రమేనా లేక పరిస్థితు లలో మార్పేదైనను వచ్చినదా?

ఈ భూమిపై సురాసురుల మధ్య ఒక పోరాటము జరుగుచున్న దని మనకు తెలియును కదా! మానవులు వారికి పనిముట్లు గాని ప్రతి నిధులు గాని అయిఉన్నారు. ఈ సంగ్రామము యొక్క పర్యవసానము ఈ భూలోకము యొక్క, మానవజాతి యొక్కయు విధి నిర్ణయమై యున్నది. తల్లిగారు ఇక్కడ దేవగణమునకు అధినేత. మానవులు స్థిర త్వములేని, నమ్మరాని ఒకతెగ. వారు ఏ పక్షమునకు చెందినవారో వారికే తెలియదు. కొందరకు రేఖామాత్రముగ తెలిసినను అది లెక్కకు వచ్చునది కాదు.

ఈ విషయము చాల వరకతవిపై నాధారపడి యున్నది. కాని, ఇక్కడ దురదృష్టమేమన అతడెవరి వైపున్నాడో అతనికే తెలియదు. మానవుడు ఇప్పుడున్న స్థితిలో నతడు దేవత్వమునకు చాల దూరస్థుడై, అసురలకు సన్నిహితుడై యుండిన కారణముచే, ఈ భూలోకములోని దేవాసురుల యుద్ధము, సమవుజ్జీకాని ఆటవలె యున్నది. మానవుడు యథార్థముగా అసురస్వభావము కలవాడు. అతడు తన ఆకాంక్షాబలము దేవత్వమునందు కొన యత్నించున్నాడు. కాని మానవుడు తన ఉత్కంఠ· ఊపిరాడని వాడై, తనస్వభావమునకు సహజమైన ఆసుర ప్రవృత్తి లోనికి దిగజారినాడు. (i)

---

(i) ( ) అరవిందులు తాను ప్ర ్యకముగా వ్రాసుకొనిన సూచనా పూర్వకమైన అంశములలో, తన శిష్యగణములో నధిక సంఖ్యాకులు అసురులనియు, ఎంత పెద్ద శిష్యుడయి అంతగొప్ప అసురుడనియు విశదపర్చినారు. బహుశ: వారు ఒకానొక అంతఃస్ఫురణ యొక్క ఉన్నత ప్రేరణ వారంతట వారు ఆత్మార్పణ · సికొని నూతన జీవిః పరిణామమును పొందుటకు వచ్చియుందురు. కాని ఆ ప్రేరణ యొక పొంగు చివరకు అంతరించగ, వారు ఆకాంక్షించిన సిద్ధి వాయిదా ః వలసి వచ్చెను. ( ) అరవిందుల మాటలయందలి యథార్థము దుర్గాస్తోత్రములో కానగును.

"ఓ తల్లి! మా ప్రాణమునకును, మనస్సునకును అసురులకు బలమును శక్తిని ప్రసాదింపుము. మా హృదయమునకును బుద్ధికిని తల యొక్క శీలసంపదను, జ్ఞానమును ప్రసాదింపుము."

మానవుడు తనలో మూర్తీభవించిన దివ్యత్వమును, వ్యక్తిగత దివ్యాంశను గూడు కట్టుకొనును. మానవునియందే పరతత్త్వమవతరించుటకు సావకాశము కలదు. ఆ కారణముగ మానవుడను పాత్రను వశము చేసికొనుటకే దేవాసురులు నిత్యము పోరాటము సాగించుచుందురు.

మానవ ప్రకృతియను పంకిల ప్రదేశమును ప్రక్షాళనము సి, పరిశుద్ధము చేసి దానిని స్వర్గవాయువులతో నింపి, అందు దివ్యతత్త్వమును స్థాపించవలె ననునదియే తల్లిగారి వాంఛ. అది జరుగనిచో, ఆ యుద్ధరంగమును పూర్తిగ అసురులకు వదలి వేయుట తప్ప ఆమెకు గత ంతరము లేదు. మానవులెట్లున్నను, ఏ పక్షమునకు చేరియున్నను, వారిలో వారు యుద్ధము చేసికొని, తుదకు, కృష్ణ నిర్యాణానంతరము యాదవులవలె నాశనము కావలసినదే. ఏ మానవుని యందైనను భగవదాకాంక్ష, భగవదభిమానము యత్కించిత్తైన కానవచ్చినచో, అట్టి మానవుని వశపరచుకొనుటకు (ఓటు హక్కును లాగుకొనుటకు) కొందరు దానవులు తమ మాయచే దేవతలవలె నటించవచ్చును. కాని యథార్థము బయటపడి నటులు తమ నిజస్వరూపమును యథాతథముగా తెలుపుకొనవలసి యుందురు.

అప్పుడే అనగా దానవులు, తమనుతాము సమూలముగా నాశనము చేసికొనినప్పుడు ఈ భూలోకము విముక్తినంది, కొత్త పరతత్త్వముతో నిండిన జాతి నిర్మింపబడుట గాక జన్మించగలదు. ఈ మానవ జాతి ఏ మాత్రమైనను మిగులునా? ఏ పరిస్థితులలో నిలుచును? వీరిలో ఏ భాగమైనను ఈ నూతన సృష్టిలో రి సమ్మిశితము కాగలదా? అను విష

యములు తెలియరాని రహస్యములై (యథార్థ) పరతత్త్వము ప్రకటించు వరకట్లు యుండును.

కాని నేనక్కడ ఈ విషయమును వదలివేయుటకు వీలులేదు. సర్వదా మానవ స్వభావములో ఆశ, ఉత్సాహమను భావములు పొంగుచునే యుండును. సౌరంగమునకు చివర అనివార్యముగ వెలుగు రావలసినదే కదా! భగవానుడిట్లు పలికెను.

"నేను కాలస్వరూపుడను. లోకములను నాశనము · యువాడను– కాలోఽస్మి లోకక్షయకృత్"– ఆయ- అసందిగ్ధపు మాటలలో ప్రతిధ్వనితో ఘోషించు తన పాంచజన్య దివ్య శంఖనాదముతో తన అభయరూప శపథమును ప్రకటించుచున్నాడు :

"భజస్వ మామ్."
"మామేకం శరణం వ్రజ."
"అహం త్వాం మోక్షయిష్యామి మా శుచః (*)

1

దేవత విభజన లేని ఒకేమూర్తి. అటులనే దానవుడు విభాగములు లేని ఏక స్వరూపుడైన ఒకేవక్తి. కాని మానవుడు విభక్త వ్యక్తిత్వము గలజీవి– వ్యక్తి ద్వయము. ఈతడొక వైపున ఆత్మ స్వరూపుడు మరియొక వైపున వి షించి శారీర సంఘటనము. ఆత స్వరూపుడుగా

---

(*) నన్నే పూజింపుము, నన్నే శరణు పొందుము.
నేను నిన్ను ముక్తినందునట్లు సెదను. దుఃఖించకుము.
,త 18 అధ్యాయము 66వ శ్లోకము.

అతడు దేవతలతో సంబంధము కలవాడు. బాహ్యమైన శా ర సంఘటన ముచే అసురులకు సన్నిహితుడు.

ఈ విధముగా మానవుడు భువికిని దివికిని మధ్య సంధానమగు చున్నాడు. మానవుడు ద్విజుడు-రెండు జన్మలు కలవాడు. భౌతిక పదార్థమగు మట్టిలో పాతుకుని యున్నాడు. మానవుడు మట్టియే పాదములుగా గలవాడను లోకోక్తి కూడ కద్దు. అతని బుద్ధి ఆకాశములోని కెగయుచు సౌరతేజస్సునందు మునకలు వేయుచుండును. మానవుడు పరిణామాత కమైన వ్యక్తియూ, అన్నమయ-భూమిక నుండి ఆవిర్భవించు అభివ్యక్త ప్రసారమై యున్నాడు. అంతమాత్రమే గాక స్వర్గమునుండి, భూమికి దిగివచ్చు అవతరణాత్మకమైన అభివ్యక్త స్వరూపుడు గూడ నగుచున్నాడు. ఇట్లు మానవుని యందు ఒక భాగము దైవమును, మరియొక భాగము అసురమునై యున్నది. దివ్యాత్మ స్వరూపుడుగా బ్రహ్మత్వమును అహంకార సమన్వితుడుగా అసురత్వమును కలిగియున్నాడు.

ఈ విశ్వవ్యూహమునందు మానవుడు మధ్య స్థానము నాక్రమించినాడు. ఊర్ధ్వమున దేవతలు స్థిరవాసము కల్గియున్నారు. అనగా ఊర్ధ్వముగా హృత్ప్రదేశము, బుద్ధిస్థానము దేవతా వాసమని యర్థము. అధోభాగము అనగా భోలోకమున అసురుల యాధిపత్యము విరాజిల్లుచున్నది. ఆ లోకమున అధో మనః ప్రవృత్తుల యొక్కయు, ప్రాణ శక్తుల యొక్కయు అధికారము ప్రచలితమగుచున్నది. ఈ రెంటికిని నడుమ, మధ్యస్థుడుగా మానవుడున్నాడు.

సురాసురులు క్రింది మూడు లోకముల అధిపత్యమునకై త్యము పోరాడుచున్నారు. కాని; ఇందలి విచిత్రమే మన ఇరువురును నవుని సహాయసంపదను ఆకాంక్షించుచున్నారు. మన పురాణగాథ

లలో మానవులను, రాజులను, యుద్ధమందారి తేరిన యోధులను దేవతలు, యుద్ధ సమయములలో తమ పక్షమునకు వచ్చి సహాయము యవలసినదిగా యాహ్వానించుట మనమెరిగి యున్నాము. మహాకవి కాళిదాసు తన రఘువంశ మహా కావ్యములో రఘుమహారాజు తన రథములో స్వర్గమునకు వెళ్ళినట్లు;

'ఆనాక రథవర్మనామ్' అను అతని శ్లోకాంశము తెలియ యు చున్నది.

మానవుడు మట్టిలో పుట్టినవాడగుట , అసురులాతనిపై సహజ ముగానే ఎక్కువ ప్రభావము (వశ్యత) కలిగియున్నారు. సాధారణ మానవుడు బాహ్యమైన మనః ప్రాణశక్తులకు మిక్కిలి లొంగియున్నాడు. మానవునిపై భూమ్యాకర్షణశక్తి ఆవరించి, అతనిని పూర్తిగా అణచి వేయుచున్నది. ఈ ప్రపంచము, మానవులును తమ బాహ్యజీవన ప్రవృత్తులయందును, కర ల యందును, అసురాక్రాంతులై వారలకు భోగ్యమానమగు మాన్యములై యున్నారు. వాటినుద్ధరించి పునర్నిర్మాణ మొనర్పవలసి యున్నది. ఈ పని సాధించుటకు సావకాశము-భూమ్యా కర్షణ శక్తితో పాటు పునరుద్ధారణము, ఆత్మోన్నయనమను రెండు శక్తులు కూడ కలిగియుండుటే అయివున్నది. కాని వీటి ప్రసారము అతి మందముగను, ప్రస్తుత పరిస్థితులలో అసమర్థముగను కన్పట్టు చున్నది.

మానవుని యొక్క పరమావధి ఈమూడు లోకములకు పరిమిత మైనదేకాదు. అతని గమ్యము ఈ మూడు లోకముల నతిక్రమించినదై, అతని అంతర్గత నిగూఢ ప్రదేశములో రూపొందింపబడి పని · యుచు న్నది. మానవుని యొక్క నియమిత గమ్యమునకు దేవతలు కూడ అసూ

యను పొందుచున్నారు. ఇందులకు కారణము మానవునిలో దివ్యత్వము నకు సహజమైన స్థిరనివాసమేర్పడి యండుటయే. మానవుని హృద్గుహాస్తరములోని యాత్మలో భగవానుడే స్వయముగా స్థానముగైకొనియున్నాడు. ఇదియే అతని ఆత్మ.

నిక్కడ మిమ్ములను వదలవచ్చును. చిత్రాతిచిత్రమగు విషయముగల గుహకడకు మిమ్ము తీసికొని వచ్చితిని. అది పురుషోత్తముడు గుహ 'గుహాహితం గహ్వరేష్టమ్' (కఠోపనిషత్) నేనిక్కడ మిమ్ములను వదలవచ్చును. ఆ పురుషోత్తముదే సర్వసమస్యలకు పరిష్కృతినిచ్చును. సర్వబంధములను ఛేదించును. వాడే పూర్ణదివ్యత్వ సిద్ధినిచ్చును. ఆ గుహలో ప్రవేశించి, నీయంతట నీవే యాత్మోపలబ్ధిని పొందవలసి యున్నది. కవిశేఖరుడును ద్రష్టయునైన 'డాంటే' వర్జిల్ మహాశయుని· ఒక భయంకరమైన ద్వారమునకు కొనిపోబడగా, దానిపై మంటలు గ్రక్కుచున్న అక్షరములలో ఘోరమైన హృదయ విదారకములైన యీ క్రింది మాటలు వ్రాయబడి యుండెను.

"ఇందు ప్రవేశించువారు అన్ని ఆశలను వదలుకొనవలెను. ఇదియే శాశ్వత నరకముయొక్క ముఖ్య ద్వారము".

కాని నేను మిమ్ములను తీసికొని వచ్చిన, కాంతివంతమగు ఈ ద్వారముపై కాంతిగల సువర్ణాక్షరములతో ఆనందదాయకములగు ఈ మాటలు లిఖింపబడి యున్నవి.

"ఇందు ప్రవేశించు వారు అన్ని ఆశలను కలిగియుండ లయును."

---

iii)

క్రియాత్మకమైన భౌతికరాజ్యము, భావపూరితమైన సూక్ష్మ రాజ్యము అని రెండు రాజ్యములున్నవి. భౌతిక రాజ్యమే (ప్రపంచమే) నిజమైనదని గాని, భావపూరితమగు సూక్ష్మరాజ్యము అసత్యము, లేక సత్యదూరమని కాదు. సూక్ష్మప్రపంచము కూడ నిజమైనదే ఇంకా ఎక్కువ వాస్తవమైనది, నిర్దుష్టమైనది భౌతిక శరీరమునకు దెబ్బతగిలిన బాధ కలుగును. కాని; ఆంగ్లమహాకవి షేక్స్పియర్ వ్రాసిన నాటకమందలి లియర్ అను రాజు, భౌతికము కానట్టి, 'కృతఘ్నత' యనెడి కానరాని సూక్ష్మమైన దెబ్బ , హోరుగా వీచు తుపాను వాయువుల వాతంబడి దెబ్బలు తిన్నవానికంటె అధికమైన బాధపడి, తుదకు పిచ్చివాడై పోయి నాడు. ఎవరైనను భౌతికమగు నాలింగనము వలన కలిగిన సుఖమును విస్మరింప వచ్చును. కాని కేవల ప్రేమయొక్క ఆనందమొకటి కలదు. పరిశుద్ధమైన నిర్వ్యాజమైన ప్రేమయే ఒకానొక విశిష్టానుభూతి. అది స్మృతిలో చెరుపరాని ఆనందముద్ర వేసికొని యుండును. బియట్రిస్ నారీమణికై డాంటే ప్రేమ, ఏకరూపమైన శుద్ధ తనచే రూపొందింప బడి నది. అందు భౌతికత మియును లేదు. అది డాంటే మహాసీయుని ఈ సృష్టియందలి లోకయాత్రలో స్వర్గములోని భగవత్సాన్నిధ్యములోనికి సహితము కొనిపోయినది. తన దివ్యప్రియుని కట్టెదుటకు భౌతికశరీరము లోనే కొని పోయినదని చెప్పబడినది.

వు భావాత్మకమగు సూక్ష్మ ప్రపంచమును సృష్టించవలెను. అది నీలో అంతర్గత నివాసమేర్పరచుకొని యుండవచ్చును. లేదా నిన్నా వరించి యుండవచ్చును. లేదా చుట్టిముట్టి యుండవచ్చును. అభూమికలో, అచేతనా స్థాయిలో రెండును ఒకటే. బాహ్య ప్రపంచము ఇంచు

మించు నీతో సంబంధము లేకయే స్వతంత్రముగానున్నది. నీకు దానిపై ఏ విధమైన అదుపుగాని, అధికారముగాని లేదు. కాని సూక్ష్మ ప్రపంచ భూమిక నీ సంకల్పశక్తికి, ప్రయోజనములకు, ఎక్కువ విధేయమై మృదుత్వము కలిగియున్నది. నీవు ఎన్నికష్టములలో నున్నను, ఈ సూక్ష్మ ప్రపంచమును, హృదయపూర్వకముగ సృజించి, విస్తరింప జేసి నీ జీవితమునకును, ఆనందమునకును మూలాధారముగా జేసికొన వచ్చును. అది నీ సౌఖ్యధామము, దివ్యమందిరము కావచ్చును. ఈ అంతర్ రాజ్యమునకు మూలాధారము, శ్రీమాతయందు అవ్యాజమగు ప్రేమ, శ్రీమాత చైతన్యమునకై యాకాంక్ష. ఇక మూలాధారము నుండి పైశిఖరాగ్రము వరకు శ్రీమాత యొక్క ప్రశాంతతతోను నిశ్చల నీరవతతోను నిండియుండవలెను.

అటుపైన నీయంతట నీవే కృషిచేసి సాధించగలవు. అందులకవసరమైన శక్తి సామర్థ్యములు నీకియ్యబడినవి. ఆ శక్తి సామర్థ్యములే శ్రీమాత యొక్క సతతసాన్నిధ్యము.

---

## ఆశ్రమము – విశ్వము – వ్యక్తి

మన ఆశ్రమము హిందూదేశము యొక్క సారభూతమైన ప్రతీకమని శ్రీమాత చాలాకాలము క్రిందట చెప్పినది. దేశమునందలి మంచి చెడులకు —అనగా సమస్తమైన దుష్ట భావములకును, సర్వబలహీనతలను, వక్రగతులకును, అసత్యములకును, అంధకారములకును, అజ్ఞానలకును,—కూడ ప్రతినిధిగా వెలయుచున్నది. ఈ ఆశ్రమము వాటికంటికి ఘనీభూతమైన కేంద్రముగా విలసిల్లుచున్న కారణము చేత వాని ప్రత్యేక తీవ్రతతో ప్రదర్శించుచున్నది.

ఇపుడు పైనుండి ఒకఒత్తిడి వాటిని మార్చుటకు దిగివచ్చినది. అందువలన వెలుగులోనికి తేవలసిన, మార్పు యవలసిన తమోధామములన్నియు బహిర్గతమైనవి. ఆశ్రమములో, బయట దేశములో, ఎల్లెడలను అవి బయటపడుచున్నవి. అన్ని ప్రదేశములయందును ఒక రకమైన లోపములు, బలహీనతలు, వక్రగతులు, బయల్పడుచున్నవి.

విశాలమైన భారతదేశములో మన ప్రభుత్వము (ఇందిరాగాంధీ నాయకత్వములో) బాహ్యవిధానములతో ఈ గతులను అరికట్టుటకు ప్రయత్నించుచున్నది. కొంతవరకు అదికూడ అవసరము. కనుక, ఇందిరాగాంధికి శక్తిసామర్థ్యము లొసంగబడెను.

కాని; ఆశ్రమము చైతన్యవంతమైన సామూహిక ంద్రముగా చేయబడెను. అందువలన ఈ పనులు అంతరంగ విధానములచే అంతర్గత మార్పువల్ల- జరుగవలసి యున్నదిగాని, బాహ్య ఒత్తిడుల వలన జరుగ,రదు. అందువలన వాటిని బాహ్యముగా అదుపులో పెట్టుటకు గాని తగినంత బలసమన్వితమైన అధికారము ఆశ్రమమున యబడలేదు. ఇక్కడ మార్పు 'ఎరుక'తో నుండవలెను గనుక నే చెప్పినట్లు అంతర్గతమైనదై యుండవలెను.

మరియు ఇక్కడ మనలో ప్రతి వ్యక్తి ఆశ్రమమునకు ఒక ప్రతీక. అతనిలో ఆశ్రమము నందలి మంచిచెడు విషయములును, గతులును, ఏదో ఒక విధముగ ప్రతిబింబించి ప్రకటితమగుచున్నవి. మంచి వారిపైన కూడ వక్రగతుల ప్రభావము పడుచునే యుండును. అందువలన ప్రతివారు ముఖ్యముగా ఉత్తములనిపించుకొనువారు-అనగా విషమైన తెలివిగలవారు-ఈ వక్రగతుల జాడలను పొడగట్టి పారదోల

వలెను. తప్పును, అసత్యమును సరిదిద్ది క్రమపద్ధతిలో పెట్టి, సత్యమును, ఋజు వర్తనమును పెంపొందించవలెను. ఆ విధముగా ఆశ్రమ వాతావరణములోను బయటను గల విషయములను మార్పు చేయుటకు తోడ్పడవలెను. ఇదియే పరిష్కారము, ఇదొక్కటియే చికిత్స. ప్రతి వ్యక్తియు తన అంతర్గత చైతన్యములో ఈ వ్యాధులను వ్యక్తిగతముగా స్వయముగా సరిదిద్దుకొనవలెను. అప్పు ఎరుకగల సామూహిక చైతన్యము, ఆశ్రమములోని ఈ చైతన్య అణువులు జీవకణములతో సహా పెరిగి వృద్ధిపొంది, తమస్థితి గాక, హిందూదేశ పరిస్థితిని, అట్లే ప్రపంచ పరిస్థితిని మార్చి మెరుగు పరుచును.

నేను చెప్పినదంతయు, ప్రధానమైన మూలసూత్ర దృష్టిలో మాత్రమే, భావినూతన సృష్టి ఆవిర్భవించ గలందులకు బలమైన బీజమెట్లు నాటవలెనను విషయమును గురించి, ంద్రములిట్టి బీజము కావలెను, అధమము ఆ ంద్రము యొక్క గర్భము, లోతైన అంతరము, ఆట్టి బీజము కావలెను. ఆ ంద్రము తన అంతరంగమును, తన సజీవమైన ఆత్మను పెంపొందించుకొనవలెను.

శ్రీమాత కూడ- భారతదేశము ప్రపంచమునకు ప్రతీక. ఆశ్రమములోని ప్రతివ్యక్తియు ఆశ్రమమునకు ఎట్లు ప్రతీకయో అటుల- ఆశ్రమము కూడ భారతదేశమునకు ప్రతీక. ప్రపంచ సమస్యలు భారతభూమి మీదనే పరిష్కరింప బడవలెను. భారతదేశమునకు అట్టిశక్తి కలదు. ఇది ౹ధివిధానమై యున్నది. హింమూదేశము సమస్యలన్నిటినెప్పుడు పరిష్క ౹చుకొనగలదో అప్పు ప్రపంచ సమస్యలన్నియు పరిష్కరింపబడి . హిందూదేశ సమస్యల పరిష్కారమునకు ఆశ్రమమే మార్గదరి లసియున్నది. తన కర్తవ్యమును నిర్వర్తించుటకు ఆశ్రమము

తయారై యున్నదా? ఇదియే తల్లిగారి ఆశయము. ఇది ఆశ్రమములోని ప్రతివ్యక్తి పైన ఆధారపడియున్నది.

అనుగ్రహ పూర్ణమైన శ్రీమాత సహాయము మనకు సర్వదా కలదని మనము ముఖ్యముగా జ్ఞాపకముంచు కొనవలెను.

---

## బంగారు గొలుసు

మీరు ఇక్కడ చాలా చాలా సంవత్సరములుగా, బహుశః మీ బాల్యము నుండి ఇక్కడనే యున్నారు. కొనుకదూ!మీలో కొందరు వెళ్ళి పోవుచున్నారు. కొందరు ఉండుటకు నిశ్చయించుచున్నారు. కొందరు అనిశ్చితులై యున్నారు. మీలో కొందరు చాలా కాలముగా ఇక్కడ యున్నారు కదా! ఇంతకాలము మీరు ఇక్కడ ఉండియేమి నేర్చుకొంటిరని మిమ్ముల నెవరైన ప్రశ్నించినచో ఏమి చెప్పెదరు? మీరు సంపాదించినది నేను చెప్పగలను. మీరు ఇక్కడ గ్రహించినది బాహ్యమైనదేదియొ కాదు. తరగతులలో కూర్చొని -ర్చుకొనినదియు కాదు. అదేదియొ కాదు. కాని, వాటికంటె వి షమైనది. అదేదో నిశ్చితముగా నెరుగుదు. అది మీకు తెలియకపోవచ్చును. కాని, అది మీ అంతరంగములో నిలిచియున్నది. మీరు మీ కాలమును వృథా చేయలేదు. మీరు దివ్యమాత సంస్పర్శ పొందియున్నారు. తల్లిగారు అ-క మారులు చెప్పియున్నారు. "ఎవరు నా స్పర్శ పొందినారో, ఎవరు ఒకక్షణము నా యందు ప్రేమభావము కల్గి నాకొరకై ఆకాంక్ష కలిగి యున్నారో, వారికి ఈ జన్మలో చేయవలసినదేమియు లేదు. వారు జన్మాంతరములలో కూడ నాకు కట్టుబడి యున్నారు. వారి కంఠమునకొక బంగారు గొలుసు

తగిలించితిని. వారి హృదయము శాశ్వతముగా నాతో బంధింపబడి యున్నది."

ఇది ఎవరును గమనించలేరు. మీరు కూడ ఎరుగరు. కాని ఇది యథార్థము. ఇది ఉన్న విషయమేగాని లేనిది కాదు. ఈ సువర్ణమయ పాశము, మీ హృదయాంతర్గతమై యున్నది. మీరెక్కడికి పోయినను, మీరు దానిని లాగుకొని పోవుచునే యుందురు. మీరు పోయిన కొలది, అది సుదీర్ఘముగా పెరుగుచునే యుండును. మీరు ఎంత దూరము పోయి నను అది సాగి, పొడుగగుచునే యుండునుగాని, ఎన్నడును తెగదు. కష్టసమయములో, వితములో తికమకలతో కూడిన సంశయాత్మక సంఘటనలు ఏర్పడినప్పుడు, అది మీయందే యుండి మీకు బలము చేకూర్చుచుండును. మీరు దానిని గుర్తెరిగి యుంటిరా మంచిదే. మీరు గుర్తెరుగలేక పోయినను అది మీయందు యున్నదని నమ్మడు. శ్రీ తల్లిగారి ప్రేమ, ఆమె సాన్నిధ్యము మీయందు సర్వదా ఉన్నవని తెలియుడు.

ఇదియే మీకు -ను చెప్పదలచినది. ఉపనిషత్తులలో ఒక కథ కలదు. ఒకానొక సమయమున నారదుడు—నారదుడనియే నా జ్ఞాపకము—జ్ఞానా ర్థియై ఒక మహర్షివద్దకు పోయెను. ఆ ఋషి పుంగవుడిట్లు ప్రశ్నించెను. "నీవు ఏమి ర్చితివి? ఇప్పుడు నావద్దకు వచ్చుటకు నీవు విద్యార్థిగా గ్రహించిన విద్యలేమి?" నారదుడు తాను బ్రహ్మచారి దశలో గ్రహించిన విద్యలన్నియు — అన్ని శాస్త్రములును, తుదకు ధనుర్విద్యతో హా-ఏకరువు పెట్టెను. అప్పుడు ఆ ఋషి పుంగవుడిట్లు చెప్పెను.— వు -ర్చినదంతయు అపరా విద్య, అధో జ్ఞానమునిచ్చునదియే. వు హ్మపదార్థము నెరిగితివా?"

"అయ్యో! లేదు. . నెరుగను" అని నారదుడు చెప్పెను.

"తెలియవలసినదదియే. అది నీకు తెలిసినచో, సర్వ విషయము లను తెలియగలవు." కనుక నేను చెప్పునది యేమన, మీకు కావలసిన ఆ ఒక్క విషయమును మీరిక్కడ సంపాదించితిరి. మీరు దానికై ప్రయత్నించనవసరము లేదు. మీరు ధన్యులు. అదృష్టవంతులు. మన మందరమును చాలా అదృష్టవంతులము. తల్లిగారు మనఅనందరిని యిచ్చోటకు పిలిచి కూడగట్టి. తన అపారప్రేమతో, మనమడుగకయే, బేషరతుగా, మనకామె ఆ భాగ్యమునిచ్చినది. మీ బాహ్య వితములో ఎట్టిప్రవృత్తి కలవారైనను, అది మీ బాహ్యప్రకృతి మార్పు చెందు నది కాదు. అది నిరపాయముగా సహజ స్థితిలో శుద్ధముగ- యుండును.

. ను 'డాంటే' పై ప్రసంగించినపుడు మీలో కొందరు హాజరై వినినారన్ని తలచెదను. డాంటే కవిశేఖరునకు కలిగిన దృశ్యము అద్భుత దృశ్యము- దివ్యమాత సిద్ధాంతమును సూచించు దృశ్యమే. ఆదృశ్యమును నేను అప్పుడపుడు చదివి వినిపించితిని. ఇప్పుడు తిరిగి చదివెదను. ఇటాలియన్ భాష నేను సరిగ చదవలేను కనుక, దానికి నా ఆంగ్లాను వాదమును చదివెదను.

---

## డాంటే దృశ్యము

(i)

అంబా మేరీ! నా సర్వస్వము నీ యందు నిక్షేపించితిని.

నా మోక్షమునకై నీ పాద ఛాయల

నీ నరకసీమల విడిచితివి.

నీ శక్తిని, నీ ఆసక్తిని గుర్తించుచున్నాను.
అదియే సర్వదా, నీ అనుగ్రహము నీ శక్తి.
బంధము నుంచి, నాకు మోక్షము నొసంగితివి.

(ii)

ఓ శాశ్వతమైన కాంతిస్వరూపమా! ఏకాకి
వై నీయందే నీవు నివసించుచున్నావు.
ఏకాకివై నిన్ను నీవర్థము సికొనుచున్నావు.
ువు నీ తెలియగలవు.
తెలిసికొని, నిన్ను నువ్వే ప్రేమించు కొనుచున్నావు.
నీకు నువ్వే మందహాసము సికొనుచున్నావు.
ఆ భ్రమణము, స్వయం కృతము
అది నీయందు ప్రతిబింబించు కాంతిరేఖ
నేను దానిని ఒక క్షణము ధ్యానించగా
నాకు కనుపించినది.
దాని యందే, దాని రంగునందే
అది నాయొక్క చిత్రపటముగా కనిపించినది.
అటుల, నేను దానియందు
సంపూర్ణముగా, ని ్శషముగా
మునిగిపోతిని.

డాంటే మహాశయుడు తన ముందొక కాంతి గోళమును
ుగొనెను. ఉన్నతమైన దివ్య ధామములో త్రిమూర్తి సమక్షములో
బడి యుండగా, అతనికి తటాలున ఒక దివ్యకాంతి గోళము గోచర
య్యెను. ఆ బింబములో దాని ప్రతిబింబము భ్రమణ యానము
ంచు గోచరించెను. ఆ పరిభ్రమణము చేయుచున్న వెలుగులోనికి

.క్ష్ణముగా చూచినంతట, అందు తన రూపమునే చూచెను. కాని తన రూపమును తాను భావించినట్లుగా గాక, ఆ పరిభ్రమణము చేయుచున్న దివ్యప్రభ, తనను కాంచిన విధముగా—అద్దాని యొక్క ప్రతిబింబముగా చూచెను.

"-ను ఆ ప్రతిబింబములో ఆ దివ ప్రకాశము భావించిన విధముగా నుంటిని గాని, నన్ను నేను భావించుకొనిన విధముగా గాదు."

మన మాటలో చెప్పవలెనన, అ ప్రకాశమానమైన గోళము, దివ్యపరతత్త్వము. అందు భ్రమణము యుచుండిన వలయాకారము గల వెలుగు, క్రియాశక్తి, శక్తిస్వరూపిణియగు దివ్యమాత. అందు నేను ఆమె బిడ్డగా, నా యథార్థస్థితిలో నుంటిని. నన్ను నేను భావించు విధముగా గాక, ఆమె నన్ను నిరూపించు విధముగా, -ను ఆ ప్రతిమలో నన్ను గాంచితిని.

డాంటే మహాశయుడు అది ఒక్క అనుభూతియని, తానొక కంటిలోనికి — ఒక పెద్ద గోళమువంటి కంటిలోనికి చూచుచుంటిననియు, ఆ కంటిలో తనయొక్క ప్రతిబింబము- దివ్యతత్త్వము తనను చూచు విధముగా-తనను తాను చూచుకొను విధముగా కాదు, తన యొక్క యథార్థమైన ఆత్మస్వరూపమును గాంచితినని చెప్పెను. ఇక దివ్యమాత మీలో వుంచిన ప్రతిబింబము, మీ యథార్థమైన ఆత్మ స్వరూపమే అని నేను చెప్పుచున్నాను. మీరెంత ప్రయత్నించినను, దానిని విడనాడలేరు. అది అక్కడనే యుండును. అది ఫలించువరకు అక్కడనే యుండును.
ను ఇంతకుముందు చెప్పిన విధముగా మీరెప్పుడు నిస్పృహ చెందినను సాధారణముగా ఈ ప్రపంచమును పరి లించునప్పుడు అందలి సన్నివేశములు, కార తలాపములు మీకు బాధను, జుగుప్సను కలిగించును- దాని

వెనుక నొక యదార్థమున్నదని గ్రహింపుడు. అదియే సర్వ నివారిణి యగు శ్రీమాత సాన్నిధ్యము మీరెప్పుడైనను మానసికముగా ఖిన్నులైనపుడు మీకు నిస్పృహ, కష్టములు కలిగినప్పుడు, మీలో తల్లిగారి సాన్నిధ్యమున్నదనియు. అది మీకు ప్రశాంతిని బలమును, ధైర్యమును ప్రసాదించుననియు, అది మిమ్మలనెప్పుడును మోసము యదనియు విశ్వాసము కలిగి యుండుడు.

శ్రీ తల్లిగారు అ క పర్యాయము లిట్లు నుడివిరి:—

"ప్రపంచము నందన్నియు నిన్ను
విడనాడ వచ్చును. గాని,
నిన్ను నేను విడనాడను."

అందుత శ్రీమాత శ. జ. గ్రం. ప్ర. సమితి ఒక లఘు ప్రణాళికను పట్టినది. దాని పర్యవసానమే 'లోక సాహిత్యమాల'. సామాన్యుడర్థము చేసికొనుటకు వీలగు భాషలో, చిన్న చిన్న పుస్తకములుగా, సరసమైన ధరలకు శ్రీమాతారవిందుల సాహిత్యమును తెలుగు వారి కందించాలను భావమే దీనికి పునాది. ఇట్టి సాహిత్యమును ఒరిస్సా రాష్ట్రమున ఒరియా భాషలో అక్కడి శ్రీ మాతారవింద కేంద్రము లందించి మార్గదర్శకములైనవి.

ఇట్టి లోక సాహిత్యమాలలో మొదటి కుసుమముగా శ్రీ నళినీ కాంత గుప్తగారి, 'Sweet Mother' అను ఆంగ్ల రచనకు 'శ్రీ మధు మయీ మాత' యను తెలుగు అనువాదమును సమితి ముద్రించినది. తెలుగు సోదర సోదర మణులు తగు లాభమునొంది శ్రీ మాతారవిందుల కృపకు పాత్రులై, ఇకముందు రాబోవు రచనలకు తగిన యూత నివ్వగలరని ప్రార్థన.

ఇట్లు

శ్రీ మానాప్రగడ శ్రీరాములు

అధ్యక్షులు

శ్రీమాత శతజయంతి గ్రంథ ప్రచురణ సమితి

హైద్రాబాద్